ఈ

గ్రంథము

విద్యావినయసంపన్నులును

దేశభక్తులును

దీనజనానురక్తులును

అగు

మ. రా. రా. శ్రీ నడింపల్లి వేంకట

లక్ష్మీ నరసింహరావు పంతులు

ఎం. ఏ. (ఆనర్సు), ఎల్. ఎల్. బి.

బార్ - అట్ - లా గారికి

వినయ పురస్సరముగ అంకితము.

★

గుంటూరు,
20-5-34

ఇట్లు బుధవిధేయుడు,
ఏకా సుబ్బారావు.

ఓం

# ఆ భా ష ణ

"....శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగాన రసంఫణిః"

అను నార్యోక్తిచే సంగీతమున కెంత మహోత్కృష్టత, ప్రాధాన్యత ప్రాపంచమున గలదో ఊహింపదగు. శబ్దబ్రహ్మాంతర్భూతమై, వేదవిహితమై భారద్వాజ, నారదాది మహర్షుల అనుభూతిస్వరూపమై భగవన్నామ సంకీర్తనానురూపమ్మైన, గానము వివిధరాగములతో - వివిధ తాళగమనములతో అనుసంధింపబడి చరాచర జీవకోటులకు శృతిప్రేయ మొనర్చి ముగ్ధుల నొనర్చినదన్న పురాణేతి హాసములును మనకు సువిదితములు. గానాభ్యాసనాపరులయు శ్రోతలయు చిత్తవృత్తులకియ్యది ఆధ్యాత్మికానుభూతి, దివ్యాద్భుతశక్తి హాయి స్థాయి సమకూర్చుననుట నిస్సంశయము.

## కా వు న

ఆబాల గోపాల మీ సంగీత విద్య నభ్యసించి మానసేందిరమ్ముల వికసింప జేసికొని, కళాజ్యోత్స్నల చలువ నీడల ననుగమించుటే జీవితయాత్రకు రాచబాట. జీవనవీణియకు చక్కని పాట. యుగయుగమ్ములు కడచన్నను ఈ విద్దియకు జరామరణంబులంటవు. ప్రాతపడదు. కూతవడదు. నిత్యనూత్నయౌవనవసంతమై కల్యాణగుణశోభితమై పలువుర హృదయమ్ముల నేదో యొకతీరు రాగాలాపనచే రాణించుచునే ఉండును. సంగీతాస్వాదనలేని ప్రాణియే లేదనుటలో వింతయే మున్నది! ఈ పరమార్థము రసవేత్తల హృదయ జిజ్ఞాసా పరిశోధనా ఫలితము. రసపిపాసగణ హృదయానంద కల్పకము.

## అం దు చే

నేటి ప్రభుత్వ మీ విద్యా ప్రచారమునకు తగినంత చేయూత నొసంగుచున్నది. పిన్నపెద్దలుత్సాహ పూరితులగునట్లు పరీక్షల నేర్పరచి ప్రోత్సహించుచున్నది. అందున నియ్యది అను-పానులతో రాణించి, ప్రభుత్వపు అండదండల శోభిల్లుచున్నది. శోభిల్లమున్నయది.

## అ భ్యా స ము

గురుశిష్యుల రూపంబుల నీ విద్య యభ్యసింపవలెను. కానిచో నియ్యది కట్టలు తెగిన ప్రవాహమువలె దారిడొంకలు - తీరుతెన్నులు లేక విచ్చలవిడి ఉఱుకుల, వఱుగుల సుడి తిరుగుడులం బడి, నిరుపయోగమై, సహజ - స్వాభావిక ఫలిత మా విష్కరింపమియు గలుగనగు. గురుముఖత నీవిద్య నేర్వవగుట

ప్రశస్తము. కాని నేడిటు లనువర్తించుట కవకాశము లేనందున అయితీగానిపని యైనది. నేర్చుట కనువగు పాఠశాలలునులేవు. ఉన్నను కొన్నికొన్ని తావుల వారికి - కొందఱకు మాత్రమే ఉపయోగములగుచున్నయవి.

## సంకల్పము

గురుశుశ్రూషచే సంగీతశాస్త్ర మభ్యసించుటకు పూర్ణావకాశములేని విద్యార్థులకు స్వీయాభ్యాసమున కనువగు సదవకాశమును గలిగించుటే మా యీ గ్రంథ రచనా సంకల్పము.

## కృషి

ఆంధ్రప్రదేశ ప్రభుత్వము సంగీత పరీక్షలకు సిలబస్సును ఏర్పరచినది. ఆ ప్రణాళిక ననుసరించి లోయరు పరీక్షలకు, పరీక్షార్థులు స్వయముగ సంగీత మభ్యసించు విధానములు, విషయములు మా 'సంగీత ప్రథమ బోధిని' యను నీ పొత్తమున సమకూర్చ బడినవి. ఇయ్యది నాల్గవకూర్పు. ఇందు విషయ విపులీకరణము గావింపబడి సుకర మొనర్చబడినది.

## వివరణ

ఇందు మున్ముందుగ సామాన్యలక్షణాంశముల కొన్నింటిని వివరించి, ఆ పై స్వరావళి - హెచ్చుతగ్గు స్థాయిలు - జంట, దాటు వరుసలు - సప్తరాగములతో రాగమొక్కింటికి ఐదువంతున ముప్పది అయిదు అలంకారములను - వీటిలో ఏడు అలంకారములకు మాత్రమే దెబ్బ - ఉసులున్నూ పేర్కొన బడినవి. ఇంకనూ పిల్లారి గీతములు - కొన్నితాళములందు సాధారణ ఘనరాగలక్షణ గీతములు - జతిస్వర, స్వరజతులును - ఆది, అటతాళ - తానవర్ణములున్ను, పైన పేర్కొనబడిన స్వరావళీ వరుసలు మొదలు అటతాళతానవర్ణముల వరకు దెబ్బ - ఉసియున్ను - కొన్నిరాగములలో వేర్వేరు తాళముల మీద ఒండురెండు కృతుల వంతున ముప్పది రెండు కృతులు రాగలక్షణములతో సహా పొందుపరచ బడినవి.

మఱియు సుగమసంగీతము 5, జావళ్లు (లేక) జావళీలు 2, జానపదములు 3, అభినయగీతము, హాస్యపుపాట, కోలాటపు కీర్తనలు 2 : సీతాకల్యాణం – శ్రీకృష్ణ లీలలు, గొబ్బి (లేక) కుమ్మిపాట, మంగళహారతులు 2, జైభారతమాతా, జాతీయ గీతములు 2, కిండర్‌గార్టన్ పాటలు 3, డెబ్బదిరెండు మేళకర్తల పథకమూ, ఇప్పటి కాలములో వాడుకయందుండు 200 రాగములకు మేళకర్తల సంఖ్యతో ఆరోహణావరోహణములు, ప్రాథమిక పారిభాషిక ప్రయోగములు 42, వాగ్గేయ కారకుల జీవిత సంగ్రహ చరిత్రలు సిలబస్సు ననుసరించి తు చ. తప్పక రూపొందించబడినవి.

## విశ్వాసము

పాఠశాలలోగాని, స్వయముగగాని సంగీతవిద్య నభ్యసించు వారలకి పొత్తము మిక్కలి ఉపయోగపడుననియు, సంగీత పండితమ్మన్యులు ఏతద్గ్రంథము నాచరణయందుంచి సంగీతవిద్యాభ్యాసమును సుకరముజేసి మా గ్రంథప్రాశస్త్య మునకును మా కృషికిని చేయూత నొసంగగలరనియు, మా "క్రొత్త సంగీతవిద్యా దర్పణము" నెడ జూపిన ప్రేమాదరాభిమానములే ఈ పొత్తము పైనను జూపగలరనియు మా సంపూర్ణ విశ్వాసము.

## కృతజ్ఞత

మా యీ చిన్నికూర్పునకు సదలంకారముగ మాకోరికపై తమ రచనలనిచ్చి మా కృషికి దోడ్పడిన మధురకవి శ్రీ ఏలేశ్వరాచార్యులు గారికిని, మేము కోరినంతన పీఠిక వ్రాసియిచ్చిన శ్రీ కాశీనాథుని శివరావు, B. Com. (Hons), LL. B. గారికిని, సర్వాంగ సుందరముగ ముద్రించిన శ్రీ ఓరియంట్ పవర్ ప్రెస్, తెనాలి వారికిని మే మెంతయు కృతజ్ఞులము.

సంగ్రహీత
బుధజన విధేయుడు
ఏకా సుబ్బారావు

గుంటూరు
28–10–58

# FOREWORD

This is the fourth edition of "*Sangeetha Pradhama Bodhini*" compiled by Sri Aka Subbarao.

The editor is too well known to the Music world to need any introduction. His 'Krotha Sangeetha Vidya Darpanam' has a unique place among books on Music. The editor, in this small volume, has tried to give a variety of Musical Compositions, choosing the best out of each. While the departmental syllabus for the Lower examination in Music has been exhaustively dealt with in the book, popular compositions, prominent among them being those composed by the Music Trinity, have also been given, to give completeness to the book.

The notation given for each composition is not only correct but modern and appealing to the present day tastes. No composition that finds place in this book is without notation and 'matrakalas.'

The life sketches of the famous music composers given in the first chapter of the book, furnish valuable and interesting anecdotes concerning the lives of the great people who dedicated their lives to the cause of Carnatic Music and who practised it as '*Moksha Vidya*'. The life histories of Saint Tyagaraja and the like in particular have a special appeal to the Music student in that they instil in him the feeling that Music should be devotional if it is to fulfil the aims set up by the famous men of music.

On the whole this manual has been got up excellently well and is of immense practical use to the music students and lovers of Music.

TENALI,
4—11—58

—**K. Shivarao,** *B. Com. (Hons.)., LL. B.*

# లోయరు గ్రేడు పరీక్ష

12-8-51 తేదీగల ఆంధ్రగజెట్ లో ప్రచురింపబడిన నూతన ప్రణాళిక

గవర్నమెంటు టెక్నికల్ పరీక్షలు

భారతదేశ సంగీతము

## Theory (సిద్ధాంతభాగము

1. పారిభాషిక ప్రయోగములు :— నాదము, స్వరము, స్వరస్థానము, శ్రుతి. ఆరోహణ, అవరోహణ, స్థాయి, ఆవర్తము, గ్రహ (ఎడుప్పు), అతీత, అనాగత, సమ; ప్రథమ, ద్వితీయ, తృతీయ కాలములు; సంగతి, అక్షరకాల, అన్య స్వర, పూర్వాంగ ఉత్తరాంగములు; ధాతు, మాతు.

2. స్వర (పరిభాషా) ప్రకరణము

3. కర్నాటక సంగీతమున వాడబడు సాంకేతికములు.

4. రాగము - జనక, జన్య రాగములు, (1) వర్జరాగములు :—
జన్యరాగములోని విభాగములు :— ఔడవ, షాడవ సంపూర్ణరకములు.
(2) వక్రరాగములు, (3) ఉపాంగ భాషాంగ రాగములు.

5. ఈ క్రింది 15 రాగములయొక్క లక్షణములు :

| | | |
|---|---|---|
| (1) తోడి | (2) ధన్యాసి | (3) మాయామాళవగౌళ |
| (4) భైరవి | (5) మధ్యమావతి | (6) మోహన |
| (7) కాంభోజి | (8) ఖమాసు | (9) శంకరాభరణము |
| (10) హంసధ్వని | (11) శుద్ధసావేరి | (12) కేదారము |
| (13) బిలహరి | (14) పంతువరాళి | (15) కళ్యాణి |

6. తాళము :— మూడు ప్రధానఅంగములు : అనుద్రుతము, ద్రుతము, లఘువు; ఏడు ప్రధానతాళములు వానిలోని అంగములు.
లఘువులోని 5 జాతులు.
35 తాళములయొక్క కల్పన (పథకము)

7. సంగీత స్వరూపము :—

సంగీతములోని ఈ క్రింది స్వరూపములయొక్క లక్షణములు.

1. సంచారిగీతము 2. లక్షణగీతము 3. స్వరజతి
4. జతిస్వరము 5. తానవర్ణము 6. కృతి 7. కీర్తన

8. ఈ క్రింది వాగ్గేయకారకుల జీవితచరిత్రలు :—

1. పురందరదాసు 2. త్యాగరాజు 3. ముత్తుస్వామి దీక్షితులు
4. శ్యామశాస్త్రి 5. అరుణాచల కవిరాయర్ 6. గోపాలకృష్ణ భారతి

9. విద్యార్థులు తాము నేర్చుకొనిన పాటలను స్వరములలో తిరిగి పాడగల్గి యుండు సామర్థ్యమును కల్గి యుండవలెను.

## అభ్యాస ప్రకరణము (Practical)

1. ఆరంభములో చెప్పబడు స్వర అభ్యాసములు; అలంకారములు; లక్షణ గీతముతోబాటు 6 గీతములు: 2 స్వరజతులు; ఒక జతిస్వరము; 2 ఆది తాళవర్ణములు; 2 అటతాళవర్ణములు; దివ్యనామకీర్తనలలో ఒకటియు, ఈ క్రింది కీర్తనలును :

| | | |
|---|---|---|
| తోడిరాగము | : | నినువినా సుఖము |
| ధన్యాసి | : | శ్యామసుందరాంగ |
| మాయామాళవగౌళ | : | మేరుసమాన |
| భైరవి | : | ఉపచారము చేసేవారున్నారని |
| మధ్యమావతి | ; | వినాయకుని వలెను |
| మోహన | : | ననుపాలింప |
| కాంభోజి | : | శ్రీరఘువరప్రమేయ |
| ఖమాసు | : | సీతాపతే నామనసున |
| శంకరాభరణము | : | మనసు స్వాధీనమైన |
| హంసధ్వని | : | రఘునాయక |
| శుద్ధసావేరి | : | కాలహరణ |
| కేదార | : | ఆనందనటన ప్రకాశం |
| బిలహరి | ; | పరిదాన మిచ్చితే |
| వంతువరాళి | : | రఘువర నన్ను |
| కళ్యాణి | : | బిరాన వరాలిచ్చి |

గమనిక :— విద్యార్థులు ఈ పై కీర్తనలుగాని లేక అంత స్థాయిలోనుండు ఇతర సాంప్రదాయక కీర్తనలుగాని పాడవచ్చును. విద్యార్థులు తానవర్ణములు రెండు కాలములలో పాడగల్గియుండవలెను.

2. ప్రత్యేక పరీక్షలు గాక సామాన్య శ్రుతపరీక్షలు (అనగా స్వరజ్ఞాన పరీక్ష, అచ్చుటచ్చుట విన్నభాగములయొక్క రాగములను పోల్చు పరీక్ష)

3. అభ్యాసపు పరీక్షలో విద్యార్థులు గాత్రపాటగాని లేక ఈ క్రింది వాద్యములలో గాని పరీక్ష నీయవచ్చును.

వీణ, గోటువాద్యము, ఫిడేలు, బాలకోకిల్, ఫ్లూటు, నాదస్వరము

గాత్రపాట విద్యార్థులు తాంబురశ్రుతితో పాడవలయును. గాత్రపాట విద్యార్థి తాంబుర తానే వేయవచ్చును. లేక ఇంకొకరిచేత (అ పరీక్షకు దరఖాస్తుదారు కానివానిచేత) వేయించవచ్చును.

పరీక్షలో ఈ క్రింది పత్రములుండును.

| | | మార్కులు |
|---|---|---|
| (1) సిద్ధాంతభాగముపై వ్రాయవలసిన పేపరు 2½ గంటల కాలవ్యవధి గలది | .... | 75 |
| (2) అభ్యాసపు పరీక్ష (Practical) | .... | 75 |

మార్కులు ఈ క్రింది విధముగా ఈయబడును :

ఉత్తీర్ణులగుటకు కనీసపుమార్కులు

| | మొత్తము | ప్రథమశ్రేణి | ద్వితీయశ్రేణి |
|---|---|---|---|
| సిద్ధాంతభాగము (Theory) | 75 | 45 | 30 |
| అభ్యాస ,, (Practical) | 75 | 45 | 30 |
| | 150 | 90 | 60 |

నూటికి 75 మార్కులతో ఉత్తీర్ణులైనవారికి విశేష ఉత్తీర్ణతాపత్రము లిచ్చెదరు.



# విషయసూచిక


| విషయము | పుటసంఖ్య |
|---|---|
| వాగ్గేయకారకుల చరిత్రలు | |
| సంగీతోత్పత్తి | 1 |
| సంగీత విభాగము | |
| సంగీత శబ్దార్థము | 2 |
| నాదోత్పత్తి | |
| నాద లక్షణము | |
| నాద శబ్దార్థము | 3 |
| నాద విభజన | |
| నాద వ్యవహారము | 4 |
| శృతిలక్షణము | |
| శుద్ధ వికృత స్వరలక్షణము | 5 |
| స్వర శబ్దార్థము | |
| సప్తస్వర ధ్వని దృష్టాంతములు | |
| సప్తస్వరముల నామములు | |
| స్వరముల ప్రకృతి వికృతి భేదములు | 6 |
| స్థాయి ప్రకరణము | |
| దశవిధ గమకములు | 8 |
| సప్తతాళములు | |
| సప్తతాళముల అంగ లక్షణము | 9 |
| సప్తతాళములకు ఘాతలు | |
| తాళములయొక్క షడంగములు | 10 |
| ముప్పదియైదు తాళముల విమర్శ పధకము | 11 |
| గ్రహప్రాణ లక్షణము | |
| గ్రహముల వివరణము | 12 |
| లయ ప్రాణ లక్షణము | |
| రాగస్థానముల విమర్శ | 13 |
| శ్రుతి జేయు పద్ధతి | |
| ఫిడెల్ వాద్యప్రకరణము | 14 |
| అనులోమ విలోమక్రమము | 15 |
| వీణెవాద్య ప్రకరణము | 15 |
| గోటువాద్య ప్రకరణము | |
| ఫ్లూటువాద్య ప్రకరణము } | 16 |
| రాగప్రకరణము.......... } | 16 |
| న్యాసాంశ గ్రహస్వర లక్షణము | 17 |
| వందనశ్లోకము | 18 |
| రాగస్వరావళి వరుసలు | 19 |
| హెచ్చు స్థాయివరుసలు | 21 |
| తగ్గుస్థాయి వరుసలు | 22 |
| జంట వరుసలు | 23 |
| దాటువరుసలు | 24 |
| 35 అలంకారములు | 25 |
| స్వరస్థానములయొక్క ప్రమాణములు | 40 |
| పిల్లారిగీతములు 5 | 41 |
| ఘనరాగ సాధారణ గీతములు | 43 |
| లక్షణ గీతములు 3 | 48 |
| జతిస్వరము 1 .... ... | 50 |
| స్వరజతులు 3 .... .... | 51 |
| తానవర్ణములు 7 (ఆదితాళ).... | 56 |
| వర్ణములను పై కాలమున పాడు పద్ధతి | 69 |
| పై కాల మోహనరాగ వర్ణము 1 | 70 |
| తానవర్ణములు (అటతాళ) 2 | 72 |
| కృతులు పాడవలసిన పద్ధతులు | 79 |
| కృతులు 32 | |
| శ్రీగణనాథం | 80 |
| రఘునాయక | 82 |
| నినువినా | 85 |
| కోటినదులు | 87 |

| విషయము | పుటసంఖ్య | విషయము | పుటసంఖ్య |
|---|---|---|---|
| శ్యామసుందరాంగ | 89 | నీనామరూపములకు | 143 |
| మేరుసమాన | 90 | సుగమ సంగీతము, మంచికంచి కామాక్షి | 144 |
| ఎటులబ్రోతువో | 92 | రాధాసమేత కృష్ణా | 146 |
| ఉపచారము | 94 | కోరిభజింతును | 148 |
| శ్రీరఘువర | 96 | అక్కడనుండే సాంబసదా | 150 |
| అంబా నీ శరణము | 98 | సాధుజనావన | 151 |
| విడెముసేయవే | 101 | జావళీలు-మధురానగరిలో | 152 |
| ఎంతనినేవర్ణింతు | 103 | కొమ్మరో | 154 |
| వినాయకునివలెను | 106 | జానపదములు - విడనీవెతకేను | 156 |
| లావణ్యరాము | 109 | చల్లనీ నా నల్లయ్య | 157 |
| బ్రోవసమయ | 111 | రావోయి చిన్నవాడా | 158 |
| రామనన్ను బ్రోవరా | 113 | అభినయగీతం - ఎవరిదామురళీ | 160 |
| శ్రీ రఘువరాప్రమేయ | 114 | హాస్యపుపాట - వద్దురాపెండ్లాము | 163 |
| ఇతరదైవముల | 116 | కోలాటపు కీర్తనలు-సీతాకల్యాణము | 164 |
| నన్నుపాలింప | 118 | శ్రీ కృష్ణలీలలు | 166 |
| సీతాపతే నా మనసున | 120 | గొబ్బి (లేక) కుమ్మిపాట - గొబ్బియ్యాలో | 167 |
| సుజనజీవన | 122 | మంగళహారతులు - జయహారతి | 169 |
| మనసు స్వాధినమైన | 124 | మంగళహారతి గైకొను కృష్ణా | 171 |
| ప్రాణనాథ బిరాన | 126 | జై భారతమాతా | 172 |
| కాలహరణ | 127 | జాతీయ గీతములు | 174 |
| పరిదానమిచ్చితే | 129 | కిండర్ గార్టన్ పాటలు | 178 |
| కనుగొంటిని శ్రీరాముని | 132 | డెబ్బదిరెండు మేళకర్తల పథకము | 182 |
| ఆనందనటన | 134 | 200 రాగములకు ఆరోహణ అవరోహణలు | 183 |
| పాహిమాం శ్రీరాజరాజే | 137 | ప్రాథమిక పారిభాషిక ప్రయోగములు | 193 |
| రఘువర నన్ను మరువ | 138 | | |
| బిరాన వరాలిచ్చి | 140 | | |
| భజనసేయవే | 141 | | |




# శ్రీ వాగ్గేయకారకుల చరిత్ర

## 1. పురందరదాసు

16 వ శతాబ్దములో మధ్వబ్రాహ్మణ ధనికకుటుంబీకుడు వరదప్ప కుమారుడు పురందరదాసు. ఈతని భార్య సరస్వతీ బాయమ్మ. సంగీత వేదోపనిషద్విద్యానిష్ణాత. పండరీ నాథ భక్తుడు.

తనయావదాస్తియు దానధర్మములకై వినియోగించిన ధర్మ వ్రతుడు. కన్నడములో దేవర నామములు వ్రాసెను. "కర్ణాటక సంగీత పితామహ" అను బిరుదమును పొందెను. ఈతడు వేదాంత విషయికముగా అసంఖ్యాకములగు కీర్తనలు రచించెను. సంగీత విద్యాభ్యాసమున కనుకూలముగా స్వరావళి-అలంకారములు గీతములు-ఠాయములు-సూళాదులు-ప్రబంధములు రచించెను. స్వరములను మాయామాళవగౌళ రాగములో బోధించుట నీమహనీయుడే ప్రారంభించెనని పెక్కురు చెప్పుదురు.

## 2. త్యాగరాజు

ఆంధ్రబ్రాహ్మణులు. రామబ్రహ్మం-శాంతమ్మ పుణ్యదంపతుల వరపుత్రుడు త్యాగరాజు. 1759-1847 ప్రాంతమువారు. వీరు తెనుగు దేశమునుండి దక్షిణమునకు వలస వెళ్ళిరి. త్యాగరాజు శొంఠి వేంకట రమణయ్యగారివద్ద సంగీతవిద్య నభ్యసించెను. సహజపాండిత్యము గల వారు. గురువీతని విద్యకై ప్రత్యేక శ్రద్ధవహించెను. వీరిఅభిమానదైవము శ్రీరామచంద్రమూర్తి. ఇష్టదైవముపై భక్తికీర్తనలు వ్రాయుచు 96 కోట్లు రామనామము జపించి, సాక్షాత్కారసిద్ధినొందెను. నారదమహర్షి వీరికి సన్న్యాసిరూపమున ప్రత్యక్షమై "స్వరార్ణవ" మను గ్రంథము నిచ్చినట్లు చెప్పుదురు: ప్రహ్లాదభక్తి విజయము-నౌకా చరిత్రము అను గ్రంథములే కాక- కృతులు-దివ్యనామసంకీర్తనలు ఉత్సవ సంప్రదాయకీర్తన లనేకము రచించెను. ఈయన రచించినవి 2400 కృతులు అనిచెప్పుదురు. వీరి కవిత్వము ద్రాక్షాపాకము. త్యాగరాజుయొక్క ప్రత్యేక

భావ, రాగ సంపత్తులీయన కృతుల కఖండ ప్రచారమొనర్చినవి. త్యాగరాజు భార్య పార్వతి. చెప్పుకోదగ్గ పతివ్రత భర్త అడుగులకు మడుగులొత్తుచు ముత్తైదువు గనే పరమపదించెను. త్యాగరాజును 1847లో తన 88 వ యేట స్వర్గస్థుడాయెను. పలువురీయన వద్ద సంగీత విద్యాభ్యాస మొనర్చిరి. ఈయన శిష్యులలో వీణకుప్పయర్-మానంబుబావడి వెంకటసుబ్బయ్యగారలు ముఖ్యులు.

## 3. శ్యామశాస్త్రి

వీరిది తంజావూరుజిల్లా తిరువూరు జన్మస్థానమ. 1763 - 1827 ప్రాంతములోని వారు తండ్రి విశ్వనాథ అయ్యర్. తల్లిపేరు తెలియదు. సుబ్రహ్మణ్యమను పేరు పెట్టు కొన్నను శ్యామ కృష్ణయ్య అని పిలచు కొనెడివారు. ఆ శ్యామ కృష్ణయ్య పేరే రానురాను శ్యామూగా మారి విద్వాంసు డైనతరి శ్యామశాస్త్రి అయినది. శ్యామ శాస్త్రి చిన్నతనముననే సంస్కృతాంధ్రముల నభ్య సించెను. మేనమామ సంగీతమునకు గురువు. తన 18 వ యేట తలిదండ్రులతో తంజావూరునకు వచ్చెను. శ్యామశాస్త్రిని గురించి ఒక వింత కథగలదు. సంగీతస్వామితని యింటికివచ్చి సంగీత గ్రంథముల నిచ్చి యపూర్వ రాగతాళ క్రమములు సొంగముగ దెలిపి 'కుమారా ! శ్యామూ ! సంగీతమునం దపార పాండిత్య నిష్ణాతుడ వైతివి. నీకు గొప్ప భవిష్యత్తున్నది. ఇకనుంచి తంజాపురాస్థాన గాయకుడగు అది అప్పయ్యగారి సంగీతము వినుచుండుము. దాన మేలు కలిగెడినని బలికి చనియె. శామ్యశాస్త్రియు అటులనే గావించు చుండెను. అప్పయ్య యీతని యం దత్యంత గౌరవాదరములు కలిగియుండెను. ఈతని గుఱించి ఎన్నియో కథలు గలవు.

శ్యామశాస్త్రి దేవీ భక్తుడు. తత్కారణమున దేవీపరముగా మూడు వందల కృతులు రచించెను. అవి కదళీపాకముగా నుండును. ఇవి

సామాన్యుల కందుబాటులో నుండవు కావున ప్రచారములో లేవు. ఉన్న పెక్కురు శిష్యులకును వాటి నాతడు బోధించ లేదు.స్వర జతులను వర్ణములను కూడ రచించెను.

జ్యోతిషమందు ప్రజ్ఞగలవాడు. త్యాగరాజునకు పరమ మిత్రుడు శ్రీ విద్యాపరుడు. వీరికి పంజు శాస్త్రి, సుబ్బరాయ శాస్త్రి అనుయిద్దరు కుమారులు గలరు. శిష్యులు, సుబ్బరాయ శాస్త్రి, అలచూరు కృష్ణయ్య దాసరి మొదలగువారు.

ఈయన భార్య పతివ్రతా శిరోమణి. భర్తకన్న అయిదు దినములు ముందుగా పరమపదించెను. 1827 వ్యయసంవత్సర శుక్లదశమి తన 64 వ యేట స్వచ్ఛందమరణము నొందెను.

## 4. ముద్దుస్వామి దీక్షితారు

వేంకటమఖి సంతతిలో రామస్వామి దీక్షితులు అను నాయనకు జన్మించెను. 1775 - 1835 ప్రాంతమువాడు. సర్వవిద్యా పారంగతుడు. 'మణలి' లో చిదంబరయోగి దర్శనముచేసి అచ్చటి నుండి కాశీకి వెళ్ళి అయిదువత్సరము లుండెను. కర్నాటక హిందూస్థానీ సంగీతము లందు ప్రజ్ఞను గణించెను. కాశీ నుంచి తిరిగి వచ్చునపుడు తిరుత్తణిలో సుబ్రహ్మణ్యేశ్వరస్వామీతని నోటిలో కలకండముక్క వేసినట్లు కథగలదు.

అప్పటి నుండి గురుగుహ ముద్రతో కృతులు వ్రాయు చుండెను. నవగ్రహకృతులు - నవార్ణవ కృతులు - పంచలింగస్థల కృతులు (పృథివ్యాపస్తేజోవాయు రాకాశములను, కంజీవరము, తిరువానైకా్కవల్, తిరువన్నామలై - కాళహస్తి - చిదంబరములకు పోల్చి వ్రాసినవి) వ్రాయుటయేగాక అపూర్వరాగములలో తానవర్ణములు, రాగమాలికలు లక్షణగీతములు కూడా వ్రాసెను. మొత్తము వీరు వ్రాసినవి 300 కృతులు. అవి సంస్కృత భూయిష్టములు. నారికేళ పాకముగా నుండును. వీరి కృతులను వీరితమ్ములు చినసామి బాల సామి దీక్షితులు మధురలో గానము చేసి మెప్పుపొందిరి. ముద్దుస్వామి దీక్షితారు

నకు చాలమంది శిష్యులు గలరు. అందరిలో ముఖ్యులు తిరుక్కడయార్ భారతి, తేవూరు సుబ్రహ్మణ్యయ్య, తిరువాలూర్ కమలం, అమ్మాణి మొదలగు వారు.

1835 లో ఒక రాకుమారుని వివాహమునకు ఎట్టయపురము వెళ్ళి అచటనే కొంతకాలమునకు తుల కృష్ణ చతుర్దశినాడు దివంగతుడయ్యెను.

## 5. అరుణాచలకవిరాయర్

నల్లతంబిపిళ్లై-వల్లియమ్మ పుణ్యదంపతుల కుమారుడు. తంజావూరు జిల్లా 'తిల్లైయాది' గ్రామనివాసి 1711 - 1778 ప్రాంతమువాడు. సంగీతవిద్యాద్రష్ట. ద్రావిడభాషలో పంచలక్షణములను తెలిసినదిట్ట. కంబ రామాయణము అర్థోపపత్తులతో ప్రసంగించుట యందతి చతురుడు. రామనాటకమును అరవములో కీర్తనలుగవ్రాసి ముద్దుకృష్ణమొదలియారు సభలో రామస్వామి దీక్షితులు మొదలగు పండితుల సమక్షమున వినిపించి కనకాభిషేకము పొంది కీర్తిగాంచెను. ఆ నాటకమును విరివిగా ప్రచారము గావించెను.

శిర్‌గాజీస్థలపురాణం, శిర్‌గాజీకొవై, హనుమార్ పిళ్ళతమిజ్, అశోముఖినాటకం మున్నగునవి రచించిరి. వీరికి ఇరువదిమంది శిష్యులుండిరి.

## 6. గోపాలకృష్ణ భారతి.

1811-1881 ప్రాంతమువారు. తంజావూరుజిల్లా "నారీమనం" గ్రామస్థుడు. తండ్రిరామస్వామిభారతి, తాతకోదండ రామయ్యర్. ఇద్దరును గొప్పవైణికులు: ఈయన యోగ, వేద విద్యల నభ్యసించెను. అజన్మబ్రహ్మచారి. సంగీతవిద్యచే గడించిన ధనము దానధర్మములకై వినియోగించెను.

ఈయన రచనలు 'జ్ఞానబింధు' — జ్ఞానకుమ్మి. అయర్ పాగై నయనార్, తిరునీలకాంతనయనార్, కరైకాల్ అమ్మయార్ చరిత్రములు అను సంగీత నాటకములను గోపాలకృష్ణ అంకితముతో వ్రాసెను. మరియు "నందనార్" చరిత్రములు నాటకముగ వ్రాసి ప్రదర్శింపించెను. సోల్ల లంకరమ్, నందిచిందు ఇత్యాది సంగీత లక్షణములను పునరుద్ధరించెను. 1881 సంవత్సరంలో మహాశివరాత్రినాడు పరమపదించెను.



ఓం

శ్రీరస్తు

# సంగీత ప్రథమ బోధిని

## 1. సంగీతోత్పత్తి

శ్లో॥ ఓంకారంచ పరబ్రహ్మ యావదోంకార సంభవః ।
అకారోకారమాకార ఏతే సంగీత సంభవాః॥

శ్లో॥ అకారో విష్ణురూపంచ ఉకారో బ్రహ్మరూపకం॥
మకారో భర్గరూపంచ సర్వ మోంకారరూపకం॥

తా॥ ఓంకారము పరబ్రహ్మ స్వరూపము. ఆ ఓంకారమునందే యావత్తు జగము పుట్టెను. అందులో అకార, ఉకార, మకారము లనే మూడక్షరములవలన సంగీతము పుట్టెనని భావము ♦ అందు అకారము విష్ణు స్వరూపమనియు, ఉకారము బ్రహ్మ స్వరూపమనియు, మకారము రుద్రస్వరూపమనియు, ఈ త్రిమూర్తుల స్వరూపమే ఓంకారమని యర్థము

## 2. సంగీత విభాగము

శ్లో॥ మార్గ దేశి విభాగేన సంగీతం ద్వివిధం మతమ్
ద్రుహిణేన యదుద్దిష్టం యదుక్తం భరతేనచ॥

శ్లో॥ తత్తద్దేశీయయా రీత్యా యత్స్యాల్లోకానురంజనమ్
దేశేదేశేషు సంగీతం తద్దేశీ త్యభిధీయతే॥

తా॥ సంగీతము మార్గమని, దేశి యని రెండువిధములు. అందు 'మార్గము' అనగా ఈశ్వర ప్రణీతమైన భరతఋషిచే ప్రకటింపబడిన సంగీతము. 'దేశి'

అనగా, ఆయా దేశ సంబంధమగు రీతిచే, ఆయా దేశపు జనులను రంజించు సంగీతము.

### 3. సంగీత శబ్దార్థము

శ్లో॥ గీతవాదిత్య నృత్యానాం త్రయం సంగీతముచ్యతే ।

తా॥ గీత, వాద్య నృత్యముల చేరికయే సంగీత మనంబడును.

రాగ స్వరశ్చ తాళశ్చ త్రిభిః సంగీత ముచ్యతే॥

తా॥ రాగము, స్వరము, తాళము లనే మూటి చేరికయు సంగీత మనంబడును.

### 4. నాదోత్పత్తి

శ్లో॥ ఆత్మావివక్షమాణోయం మనః ప్రేరయతేమనః ।
నాభిస్థవహ్నిమాహంతి నప్రేరయతిమారుతమ్॥

శ్లో॥ బ్రహ్మగ్రంధిస్థితోనాదః క్రమా దూర్ధ్వపథేచరన్
నాభిహృత్కంఠమూర్ధాస్యే ష్వావిర్భవతి సధ్వనిః
నాదేతిసూక్ష్మశ్చ పుష్టోఽపుష్టశ్చ కృత్రిమః
ఇతిపంచాభిధాం దత్తే పంచస్థానస్థితా క్రమాత్॥

తా॥ తనచేత విచారింపబడిన యీ యాత్మ మనస్సును ఉద్బోధించును. ఆ మనసు నాభియందున్న అగ్నినికొట్టును. ఆ యగ్ని వాయువును ప్రేరేపించును ఆత్మ, మనస్సు, అగ్ని, వాయువు, ఈ నాలుగున్ను కారణములై నాదమును బుట్టించును. బ్రహ్మగ్రంధియందున్న ఆ నాదము ఊర్ధ్వముఖముగా సంచరించుచు, క్రమముగా నాభి, హృదయము, కంఠము, మూర్ధము, ఆస్యము వీటియందు పుట్టుచున్నది. ఈనాదము నాభియందు అతి సూక్ష్మముగను, హృదయమందు సూక్ష్మముగను, కంఠమునందు పూర్ణముగను, శిరమునందు అపూర్ణముగను, ఆస్యమందు కృత్రిమముగను పుట్టుచున్నది.

### 5. నాదలక్షణము

శ్లో॥ ననాదేన వినాగీతం ననాదేన వినాస్వరః
ననాదేన వినారాగ స్తస్మా న్నాదాత్మకం త్రయమ్॥

శ్లో॥ గీతంనాదాత్మకం వాద్యం నాదం వ్యక్తం ప్రశస్యతే ।
తద్ద్వయానుగతం నృత్యం నాదాధీన మతస్త్రయమ్॥

శ్లో॥ నాదేన వ్యజ్యతే వర్ణః పదంవర్ణాత్పదా ద్వచః।
వచసో వ్యవహారోఽయం నాదాధీన మతో జగత్ ॥

శ్లో॥ నాదోపాసనయా దేవా బ్రహ్మావిష్ణు మహేశ్వరాః।
భవంత్యుపాసితా నూనం తస్మాదేతే తదాత్మకాః ॥

తా॥ గీతము, స్వరము, రాగము ఈ మూడున్ను నాదమును విడచియుండవు గాన ఇవి నాదాత్మకంబు ♦ గీతము నాదాత్మకము, వాద్యము నాదముయొక్క వివరణచే ప్రకాశింపబడుచున్నది. నృత్యము గీతవాద్యముల ననుసరించియున్నది కాన, నీమూడును నాదాధీనము ♦ నాదమువలన అక్షరమును, అక్షరముచే పదమును, పదముచే వాక్యమును, వాక్యముచే లోకవ్యవహారమును, అగుటవలన వీటితోకూడిన యావజ్జగత్తు నాదాధీనము. అట్టి నాదమునుపాసించుటచే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురున్ను ఉపాసింపబడినవారగుచున్నారు కాన, ఈ త్రిమూర్తులున్ను నాదాత్మకులు.

## 6. నాదశబ్దార్థము

శ్లో॥ నకారం ప్రాణనామానం దకార మనలం విదుః
జాతః ప్రాణాగ్నిసంయోగా త్తేన నాదోఽభిధీయతే॥

తా॥ నాద మను రెండక్షరములలో, న అను యక్షరము ప్రాణ మని ప్రసిద్ధమైయుండును. ద అను యక్షరము అగ్నిరూపమని చెప్పఁబడినది. ఈ కారణముచేత ప్రాణాగ్నులయొక్క సంయోగమువలన నాద మను శబ్ద మయ్యెను.

## 7. నాద విభజన

శ్లో॥ ఆహతోఽనాహతశ్చేతి ద్వేధా నాదో నిగద్యతే
తత్రచానాహతం నాద మేకాగ్రస్యసమానసాః ॥

శ్లో॥ గురూపదిష్ట మార్గేణ మహాంత్తః పర్యుపాసతే
దశరక్తి విహీనత్వా న్న మనోరంజకోఽనృణాం ॥

శ్లో॥ తస్మాదాహతనాదస్య శృత్యాదిద్వారితో ఖిలమ్
జ్ఞేయం వితన్వతే లోక రంజనమ్ భవభంజనమ్॥

తా॥ నాదము ఆహతము, అనాహతము అని రెండువిధములు. అందులో అనాహతనాదము నిశ్చలమనస్సు గలవానికే సాధ్యము. ఈ అనాహత నాదమును గురువులచే నుపదేశింపఁబడిన మార్గముచేత ఋషు లుపాసించుచున్నారు. అదియును రక్తిలేకపోవుటచే జనులకు మనస్సంతోషము గలుగదు కాన ఆహతనాదమును శృత్యాది ముఖముగా తెలిసికొనినయడల జనులకు ఆనందమును, పాపనాశనమును సంపూర్ణముగా చేయుచున్నది.

## 8. నాదవ్యవహారము

శ్లో॥ వ్యవహారే త్వసౌ త్రేధా హృదిమంద్రోభిధీయతే
కంఠే మధ్యో మూర్ధ్ని తారో ద్విగుణశ్చోత్తరోత్తరమ్॥

తా॥ ఈ నాదము హృదయమునందున్నప్పుడు మంద్రమనియు, కంఠమందున్నప్పుడు మధ్య మనియు, మూర్ధమందున్నప్పుడు తార మనియు చెప్పఁబడును. హృదయ కంఠమూర్ధములను మూడుస్థానములందు నేయే ప్రమాణముగా నుండునో ఆనాదము ఒకదానికంటె నొకటి ఎక్కువగలదై యుండును. కనుక వీనికి మంద్ర మధ్య తారములని పేరు కలిగియున్నది.

## 9. శ్రుతిలక్షణము

శ్లో॥ ప్రథమశ్రవణాచ్ఛబ్ద శ్శ్రూయతే హ్రస్వమాత్రకః
సాశ్రుతి స్సం పరిజ్ఞేయా స్వరావయవలక్షణా॥

శ్లో॥ శ్రుతిభ్యశ్చస్వరా షడ్జ ఋషభ గాంధార మధ్యమాః
పంచమో ధైవతశ్చాథ నిషాద ఇతి సప్తతే॥

శ్లో॥ శ్రుతిభ్యస్స్యుః స్వరాస్సర్వే స్వరేభ్యోగ్రామసంభవః
గ్రామేభ్యోజాతయో జాతాః జాతిభ్యోరాగసంభవః॥

తా॥ శ్రుతియనగా శ్రవణమువల్ల ముందుగా నే శబ్దము వినబడుచున్నదో అది షడ్జమము మొదలగు స్వరావయవలక్షణముగల హ్రస్వమాత్రక శబ్దవిశేషము శ్రుతియనఁబడును ‡ అట్టి శ్రుతులవలన షడ్జమము, రిషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాధములను సప్తస్వరములు కలిగెను. ఈ సప్తస్వరములవలన గ్రామములును, గ్రామములవలన జాతులును జాతులవలన రాగములును బుట్టుచున్నవి.

## 10. శుద్ధవికృత స్వరలక్షణము

శ్లో॥ శుద్ధాశ్చ వికృతాశ్చేతి ప్రథమం ద్వివిధాస్స్వరా
నియత శ్రుతిసంపన్నాః స్వరాశ్శుద్ధా ఇతి స్మృతాః
శ్రుత్యుత్కృష్టాపకృష్టాస్తు వికృతాః ప్రతిపాదితాః॥

తా॥ స్వరములు శుద్ధములని, వికృతములని రెండు విధములు. శుద్ధములనగా, నియతములయిన శ్రుతులతో కూడుకొన్న స్వరములు – వికృతములనగా, నియతశ్రుతులకు హెచ్చుగాని తక్కువగాని అయిన సర్వములు.

## 11. స్వరశబ్దార్థము

శ్లో॥ స్వరోరంజయతి శ్రోతృ చిత్తం స స్వర ఉచ్యతే॥

తా॥ స్వ, స్వకీయముగ రం, రంజించునదిగాన స్వరమని చెప్పంబడును.

## 12. సప్తస్వరధ్వని దృష్టాంతములు

శ్లో॥ షడ్జం మయూరో వదతి గావస్త్వృషభ భాషిణః
అజావికంతు గాంధారం క్రౌంచః క్వణతి మధ్యమమ్॥

శ్లో॥ పుష్పసాధారణేకాలే పికః కూజతి పంచమమ్
ధైవతం హేషతే వాజీ నిషాదం బృంహతేగజః॥

తా॥ షడ్జస్వరమువలె నెమలి కూయును.
ఋషభ స్వరమువలె వృషభంబు ధ్వనించును.
గాంధార స్వరమువలె మేక శబ్దించును.
మధ్యమ స్వరమువలె క్రౌంచపక్షి పలుకును.
పంచమ స్వరమును వసంత ఋతువునందు కోకిల కూయును.
ధైవత స్వరమువలె గుఱ్ఱము ధ్వనించును.
నిషాద స్వరమువలె ఏనుగు ఘీంకరించును.

## 13. సప్తస్వరముల నామములు

శ్లో॥ షడ్జఋషభగాంధారం మధ్యమం పంచమస్తథా
ధైవతం నిషాదశ్చైవ సప్తస్వరవిధీయ్యతే॥

తా॥ ఈ సప్తస్వరములకు షడ్జమము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదము అనియౌగిక నామములు. వీటికి ప్రతిగా

నుచ్చారణ సౌకర్యార్థ, సంజ్ఞలు స, రి, గ, మ, ప, ధ, ని, అను ఏడువర్ణ ములు ఏడుస్వరములుగా నేర్పరచబడినవి. ఈ సప్తస్వరంబులకు, ప్రకృతి యని, వికృతియని రెండు నామములు. వానిలో షడ్జ స్వరమును, పంచమ స్వరమును నెప్పటికిఁ బ్రకృతిగానే చెప్పఁబడినది. తక్కిన రి, గ, మ, ధ, ని అను అయిదు స్వరములును, ప్రకృతి వికృతి భేదంబులు గల్గియుండుటచే పై జెప్పిన సప్తస్వరములును పదియాఱు భేదంబులగు చున్నవి. వాని పేళ్ళి క్రింద వ్రాయఁబడి యున్నవి.

## స్వరముల ప్రకృతి వికృతి భేదములు

| ప్రకృతి | | వికృతి | వికృతి |
|---|---|---|---|
| స | షడ్జమము | లేదు | లేదు |
| రి | శుద్ధఋషభము | చతుశ్శ్రుతిఋషభము | షట్ఛ్రుతి ఋషభము |
| గ | శుద్ధగాంధారము | సాధారణగాంధారము | అంతర గాంధారము |
| మ | శుద్ధమధ్యమము | ప్రతిమధ్యమము | లేదు |
| ప | పంచమము | లేదు | లేదు |
| ద | శుద్ధధైవతము | చతుశ్శ్రుతి ధైవతము | షట్ఛ్రుతి ధైవతము |
| ని | శుద్ధనిషాదము | కైశిక నిషాదము | కాకలి నిషాదము |

ఈ ప్రకృతి వికృతిచే కలిగిన పదియాఱు స్వరములను ఆరోహణావరోహణ గతిగా మూర్ఛనయై అనేక మూర్ఛనలచేత, అనంతా వై రాగః యని అసంఖ్యేయ ములుగా అనేక రాగములను కల్పించుచున్నవి. ఈ స్వరములు ఒకదానికంటె నొకటి హెచ్చుచు బోయెనేని ఆరోహణమనియు, తగ్గుచు వచ్చెనేని అవరోహణ మనియుఁ జెప్పఁబడును. వీటియందు షడ్జమపంచమములను ఆధారముగా శ్రుతి గూర్చుకొని జంత్ర గాత్రములయందు వాడుకొనవలయును.

## 14. స్థాయి ప్రకరణము

అనుభవమందు చతుశ్శ్రుతి ఋషభమును, శుద్ధగాంధారమును, ఒక స్థానము నందే పుట్టుచున్నవి. ఈ ప్రకారము షట్ఛ్రుతి ఋషభమునకు, సాధారణ గాంధార మనియు చతుశ్శ్రుతి ధైవతమునకు శుద్ధనిషాదమనియు, షట్ఛ్రుతి ధైవతమునకు

కైశిక నిషాదమనియు, ఒకధ్వనికే రెండేసి నామములు వాడుకయందున్నవి. కాన ప్రకృతి వికృతిచే గలిగిన స్వరస్థానములు పండ్రెండున్ను, నామములు పదియాఱున్ను కలిగి యున్నవి. వాటి వివర మీక్రింద వ్రాయబడుచున్నవి.

ఉదాహరణము

ఈ పదియాఱు నామములు.

| | | | |
|---|---|---|---|
| షడ్జమము. | స | | 1 |
| శుద్ధ ఋషభము. | రి | | 2 |
| చతుశ్రుతి ఋషభము.<br>శుద్ధ గాంధారము. | రి$_{2}$<br>గ$_{1}$ | ఈ రెంటికి<br>ధ్వని ఒకటే | 3 |
| షట్శ్రుతి ఋషభము.<br>సాధారణ గాంధారము. | రి$_{3}$<br>గ$_{2}$ | ఈ రెంటికి<br>ధ్వని ఒకటే | 4 |
| అంతర గాంధారము. | గ$_{3}$ | | 5 |
| శుద్ధ మధ్యమము. | మ$_{1}$ | | 6 |
| ప్రతి మధ్యమము. | మ$_{2}$ | | 7 |
| పంచమము. | ప | | 8 |
| శుద్ధ ధైవతము. | ధ | | 9 |
| చతుశ్రుతి ధైవతము.<br>శుద్ధ నిషాదము. | ధ$_{2}$<br>ని | ఈ రెంటికి<br>ధ్వని ఒకటే. | 10 |
| షట్శ్రుతి ధైవతము.<br>కైశిక నిషాదము. | ధ$_{3}$<br>ని$_{2}$ | ఈ రెంటికి<br>ధ్వని ఒకటే. | 11 |
| కాకలి నిషాదము. | ని$_{3}$ | | 12 |
| షడ్జమము. | స | | ,, |

ఈ పండ్రెండు స్థానములు.

ఇట్లు యీపైచెప్పిన షడ్జమము మొదలు ఆరోహణగతిగా మరల షడ్జమము నందుట ఒక స్థాయి యనంబడును. అది మంద్రము, మధ్యము, తారము అని త్రివిధము. వీటి యన్నిటిలో మంద్రస్థాయి తక్కువ యయినది. మధ్యమ స్థాయి మంద్రతారములకు మధ్యనుండునది. తారస్థాయి ఈ రెంటికంటె హెచ్చైనది.

## 15. ఉదాహరణము

| మంద్రస్థాయి | మధ్యస్థాయి | తారస్థాయి |
|---|---|---|
| | | . . . . . . . |
| స రి గ మ ప ధ ని | స రి గ మ ప ధ ని | స రి గ మ ప ధ ని |
| . . . . . . . | | |

ఇందు నక్షత్రసంజ్ఞగల గుఱుతులు, స్వరములకుఁ గ్రింద నుండెనేని మంద్రస్థాయియనియు, స్వరములకు పైనుండెనేని తారస్థాయియనియు, సంజ్ఞ లేకుండెనేని మధ్యస్థాయియనియు. నూహించునది. మఱియు ఈ నక్షత్రము గుఱుతులవలన స్వరాలంకార గీతపదవర్ణకృతులు మొదలగు పాటలయొక్క స్వరములు యీ స్థాయియందు ఉంటున్నవని తెలిసికొనవచ్చును.

## 16. దశవిధగమకములు

శ్లో॥ ఆరోహమవరోహంచ ఢాలుస్ఫురిత కంపితాః
ఆహతః ప్రత్యాహతశ్చ త్రిపుశ్ఛాందోళమూర్ఛనాః॥

| | | |
|---|---|---|
| 1 | ఆరోహణము | సరిగమ పధనిస |
| 2 | అవరోహణము | సనిధప మగరిస |
| 3. | ఢాలు | సప, సమ, సగ, సరి, సస |
| 4 | స్ఫురితము | ససరిరి గగమమ |
| 5 | కంపితము | పాపపపప, ఒక్కస్థానమునందు నిలిచి |
| 6 | ఆహతము | సరి రిగ గమ [తంత్రి నల్లార్చుట |
| 7 | ప్రత్యాహతము | సని నిద ధప |
| 8 | త్రిపుచ్ఛము | ససస, రిరిరి, గగగ, మమమ |
| 9 | ఆందోళము | సరిసపాప, రిగరిమామ |
| 10 | మూర్ఛన | సరిగమపధని, రిగమపధనిస |

## 17. సప్తతాళములు

శ్లో॥ ధ్రువోమఠ్యోరూపకశ్చ ఝంపా త్రిపుట ఏకచ
ఆటతా ళేక తాళేశ్చ సప్తతాళాః ప్రకీర్తితాః॥

తా॥ ధ్రువతాళము, మఠ్యతాళము, రూపకతాళము, జంపెతాళము, త్రిపుట తాళము, అటతాళము, ఏకతాళము. అని తాళములు ఏడు.

## 18 సప్తతాళముల అంగలక్షణం

| | |
|---|---|
| శ్లో॥ లఘుచద్రుతద్విలఘుచ ధ్రువతాళాంగ మేవచా॥ | । ० । । |
| ,, లఘుద్రుతలఘుశ్చైవ మఠ్యతాళే ఇతిస్మృతః॥ | । ० । |
| ,, ద్రుతమేకం లఘుర్యేకో రూపకస్య ప్రకీర్తితః॥ | ० । |
| ,, లఘుచానుద్రుతంచైవ ద్రుతోఝంపేతి కీర్తితః॥ | । ◡ ० |
| ,, లఘుద్రుతద్రుతశ్చైవ త్రిపుటతాళాంగమేవచా॥ | । ० ० |
| ,, లఘుద్వంద్వం ద్రుతద్వంద్వం ఆటతాళాంగమేవచా॥ | । । ० ० |
| ,, ఏకతాళే లఘుస్మృతః॥ | । |

తా॥ ధ్రువతాళమునకు, ఒక ద్రుతము మూడు లఘువులును, మఠ్యతాళమునకు రెండు లఘువులు ఒక ద్రుతమును, రూపకతాళమునకు ఒక ద్రుతము ఒక లఘువును, జంపెతాళమునకు లఘువు అనుద్రుతము ద్రుతమును, త్రిపుట తాళమునకు ఒక లఘువు రెండు ద్రుతములును, అటతాళమునకు రెండు లఘువులు రెండు ద్రుతములును, ఏకతాళమువకు ఒక లఘువును. ఈ తీరున భరతాచార్యులు మొదలగువారివలన నియమించబడినవి.

## 19. సప్తతాళములకు ఘాతలు

ఘాత అనగా చేతితో కొట్టెడి దెబ్బకు పేరు

శ్లో॥ ధ్రువతాళే చతుర్ఘాతే మఠ్యకాయాం త్రయోవతః
రూపకేతుచ ఝంపాయాం త్రయం త్రిపుట యత్రయం
ఆటతాళేతు చత్వారో ఏకతాళేతు ధక్కరః॥

తా॥ ధ్రువతాళమునకు ఘాతలు నాల్గును, మఠ్యతాళమునకు ఘాతలు మూడును రూపకతాళమునకు ఘాతలు రెండును, ఝంపెతాళమునకు ఘాతలు మూడును, త్రిపుటతాళమునకు ఘాతలు మూడును, అటతాళమునకు ఘాతలు నాల్గును, ఏకతాళమునకు ఘాత ఒకటియు, ఉండునని ఇటుల భరతాచార్యుల వలన జెప్పఁబడెను. మఱియు. పాటలు మొదలగునవి పాడుటయందు తాళ మును దురితముగా వేయవలసినపుడు ఆయా తాళములను ఘాతలచేతనే వేయ బడును. ఇదియునుగాక, కంచు మొదలగు లోహతాళములతో వాయించు నపుడు ఆయా తాళములను ఘాతలవల్లనే వేయఁబడును.

20. తాళములయొక్క షడంగములు

| షడంగముల పేర్లు | అంగ సంజ్ఞలు. | అక్షర కాలము |
|---|---|---|
| అనుద్రుతము | ∪ | 1 |
| ద్రుతము | ○ | 2 |
| లఘువు | । | 4 |
| గురువు | S | 8 |
| ప్లుతము | ।S | 12 |
| కాకపాదము | + | 16 |

21. తాళమునకుంగల జాతులు

| ఐదుజాతుల పేర్లు | అక్షరములు |
|---|---|
| చతురశ్రజాతి | 4 |
| తిశ్రజాతి | 3 |
| మిశ్రజాతి | 7 |
| ఖండజాతి | 5 |
| సంకీర్ణజాతి | 9 |

ఈ షడంగములలో అనుద్రుతము, ద్రుతము, లఘువు అనే ఈ మూడంగములు మాత్రము పై నుదహరించిన సప్తతాళములయందు నుపయుక్తములై యున్నవి. తక్కినవి నూటొక్క తాళములయందు ప్రయోగింపబడియున్నవి. మఱియు ఏతాళములకైనను, అనుద్రుతము ఒక అక్షరమును, ద్రుతము రెండక్షరములును, లఘువు నాలుగక్షరములను గలిగియుండును. ఇందులో లఘువుమాత్రము జాతిభేద మగుచున్నది. లఘువును జాతిభేదముగా వేయుటకు చేతిప్రేళ్ళయొక్క పేళ్ళను దెలిసియుండవలయునుగాన, వాటి పేర్లుక్రింద వ్రాయబడుచున్నవి.




1—ఈ అంకెగలది, కనిష్ఠకయనే చిటికెనప్రేలు.

2—ఈ అంకెగలది, అనామికమను ప్రేలు.

3—ఈ అంకెగలది, మధ్యమప్రేలు.

4—ఈ అంకెగలది, తర్జని ప్రేలు.

5—ఈ అంకెగలది, అంగుష్టమనే ప్రేలు.

ఈ ఐదుప్రేళ్ళయందు చతురశ్ర, తిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణములనే ఐదు జాతుల లఘువులను, వేసెడి క్రమ మెటువలెనంటే:—

చతురశ్రజాతిలఘువు వేయవలసినపుడు, తొలుత ఘాతయు, తరువాత చిటికిన ప్రేలును, అటువలెనే అనామిక, మధ్యమప్రేలువఱకు నాలుగక్షరములు వేయుట చతురశ్రజాతి లఘు వనంబడును.

తిశ్రజాతిలఘువు వేయునపుడు, ఘాతమొదలుకొని అనామికమను ప్రేలువఱకు మూడక్షరములు నడుపుట తిశ్రజాతి లఘువనంబడును.

మిశ్రజాతిలఘువు వేయునపుడు, ఘాతమొదలుకొని అంగుష్టమువఱకు బోయి మఱల చిటికినప్రేలువఱకు ఏడు అక్షరములు వేయుట మిశ్ర జాతి లఘు వనంబడును.

ఖండజాతిలఘువు వేయునపుడు, ఘాతమొదలు తర్జనీప్రేలువఱకు ఐదక్షరములు వేయుట ఖండజాతి లఘు వనంబడును.

సంకీర్ణజాతి లఘువు ఘాతమొదలు అంగుష్టమనే ప్రేలువఱకు బోయి, మరల చిటికెన, అనామిక, మధ్యమ ప్రేలు వఱకు తొమ్మిదక్షరములు క్రమముగా వేయుట సంకీర్ణజాతి లఘువనంబడును.

ఇందువల్లనే సప్తతాళములు ఐదుజాతులచే ముప్పదిఐదు తాళములగుచున్నవి. వాటి వివర మిక్రింద వ్రాయబడుచున్నది.

## ముప్పదియైదు తాళముల విమర్శ పథకము

| తాళ సంఖ్య | సప్త తాళముల పేర్లు | తాళ అంగ సంజ్ఞలు | త్రిశ్రజాతి | | చతురశ్ర జాతి | | ఖండజాతి | | మిశ్రజాతి | | సంకీర్ణజాతి | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | తాళములు | అక్షర సంఖ్య | తాళములు | అక్షర సంఖ్య | తాళములు | అక్షర సంఖ్య | తాళములు | అక్షర సంఖ్య | తాళములు | అక్షర సంఖ్య |
| 1 | ధృవ | I O I I | మణి | 11 | శ్రీకర | 14 | ప్రమాణ | 17 | పూర్ణ | 23 | భువన | 29 |
| 2 | మఠ్య | I O I | సార | 8 | సమ | 10 | ఉదయ | 12 | ఉదీర్ణ | 16 | రావ | 20 |
| 3 | రూపక | O I | చక్ర | 5 | పత్తి | 6 | రాజ | 7 | కుల | 9 | బిందు | 11 |
| 4 | ఝంపె | I U O | కదంబ | 6 | మధుర | 7 | చణ | 8 | సుర | 10 | కద | 12 |
| 5 | త్రిపుట | I O O | శంఖ | 7 | ఆది | 8 | దుష్కర | 9 | లీల | 11 | భోగ | 13 |
| 6 | అట | I I O O | గుప్త | 10 | లేఖ | 12 | విదళ | 14 | లోక | 18 | ధీర | 22 |
| 7 | ఏక | I | సుధ | 3 | మాన | 4 | రత | 5 | రాగ | 7 | వసు | 9 |

### 22. గ్రహప్రాణ లక్షణము

శ్లో॥ అతీతా నాగతశ్చైవ సమశ్చ విషమోపిచ
గ్రహాశ్చతుర్విధా ప్రోక్తా తత్స్వరూపం నిరూప్యతే॥

తా॥ అతీతము, అనాగతము, సమము, విషమము అని గ్రహములు నాలుగు విధములు.

### గ్రహముల వివరణము

శ్లో॥ గీతాతీతేత్వతీతస్యా త్తాళాతీతే త్వ నాగతః
గీతాయా తాళసంయుక్తో సమగ్రహ మితీరితమ్॥

ఆద్యంతర యోరనియమో విషమశ్చ ప్రకీర్తితః
మాత్రాధిక్యంచ తస్యైవ క్వచిత్క్వచిత్ప్రచక్షతే॥

తా॥ గీతము నడిచినపిమ్మట తాళము నడచుట అతీతమనంబడును. తాళము నడిచినపిదప గీతము నడుచుట అనాగత మనంబడును. తాళగీతములు సమముగా నడుచుట సమమనంబడును. ఈమూడు విధములుగాక నడచునది విషమ గ్రహ మనంబడును. మఱియు, గీతాదులకన్నను తాళమాత్రలు రెండుగాని, మూడుగాని, నాలుగుగాని, అతీతమైతే అది అతీతగ్రహమనియు, ఇన్నిమాత్రలే అనాగతమైతే అది అనాగత గ్రహమనియు, సదరు ప్రకారము 5, 6, 7, 8 మాత్రలు గీతముకంటె అతీతమైనను అనాగతమైనను అది విషమ గ్రహమనంబడును. ఇటుల రంగరాజ లొల్లి భట్టులు మొదలైన భారతభాష్య వ్యాఖ్యాతలు నిర్ణయించినారు.

### 23. లయప్రాణ లక్షణము

శ్లో॥ తాళాంతరాళవర్తీయః కాలోసౌ లయనామకః
ద్రుతమధ్యవిళంబాశ్చ భవేయుస్త్రివిధా లయాః
ద్రుతోమధ్యో విళంబశ్చ ద్రుతశ్శీఘ్రతమోమతః
ద్విగుణాద్విగుణో జ్ఞేయో తస్మాన్మధ్య విళంబితౌ॥

తా॥ తాళమునడుమ నడిచెడికాలము లయ యనంబడును. అది ద్రుతము, మధ్యము విళంబము; అని త్రివిధములు. అందు మిక్కిలి శీఘ్రమయిన ద్రుతము. దానిని ఇనుమడింప మధ్యము. దానిని ఇనుమడింప విళంబిత మగును. ద్రుతలయ అనగా పాడుటకు నెంతత్వరగా తాళమువేసికొని పాడనగునో అట్లు తాళమువేసికొని పాడుట. మధ్యలయ అనగా, ధృతలయకు రెట్టింపువిళంబము చేయుట. విళంబము అనగా, ఆమధ్యలయకంటె రెట్టింపు విళంబముచేయుట. మఱియు, ( గీతతాళాదీనా మేకత్రవిరామోలయః ) అనియు, "శ్రుతిర్మాతా పితాలయః" అనియు, జెప్పియుండుటచేత లయ, ముఖ్యప్రాణమని నెఱుంగునది.

## 24. రాగస్థానముల విమర్శ

ఈ గ్రంథమందుండు స్వరాలంకార గీతములకుగల రాగములయొక్క మేళములనుసహా వాటిపైనే ఉదహరింపఁబడియున్నవి. ఆయా రాగస్థానములను దెలియుటకై ఈ క్రింద వ్రాయబడియున్న గుఱుతులనుబట్టి తెలిసికొనవలయును.

శు—అని వ్రాసియుండు గుఱుతు, శుద్ధమనియు
చ—అని వ్రాసియుండు గుఱుతు, చతుశ్రుతియనియు
ష—అని వ్రాసియుండు గుఱుతు, షట్ఛ్రుతియనియు
సా—అని వ్రాసియుండు గుఱుతు, సాధారణ గాంధారమనియు
అం—అని వ్రాసియుండు గుఱుతు, అంతర గాంధారమనియు
ప్ర—అని వ్రాసియుండు గుఱుతు, ప్రతిమధ్యమనియు
కై—అని వ్రాసియుండు గుఱుతు, కైశిక నిషాదమనియు
కా—అని వ్రాసియుండు గుఱుతు, కాకలి నిషాదమనియు నూహించవలెను.

### ఉదాహరణము

### మాయామాళవగౌళ రాగము

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| నెం. 1 | స | రి | గ | మ | ప | ధ | ని | స | స ని ధ ప మ గ రి స |
| | ,, | శు | అం | శు | ,, | శు | కా | ,, | ఇది అవరోహణము |

నెం. 2 మాయామాళవగౌళ—స, శురి, అంగ, శుమ, ప, శుధ, కాని.

ఇట్లు పై నుదహరించిన ప్రకారము రాగములయొక్క ఆయాస్థానములను దెలియుటకై 1టొ నెంబరు పద్ధతిగాను, 2డో నెంబరు పద్ధతిగాను, స్వరములకు క్రిందనుగాని, ప్రక్కనుగాని, ఏయే అక్షరములు గుఱుతులుగా వ్రాసియుండునో ఆ స్వరములను ఆయా స్థానములని యెఱుంగవలెను.

మఱియు పై నుదహరించిన 1, 2, నెంబర్లుగల మాయామాళవగౌళ రాగముయొక్క స్వరస్థానము లెవ్వియనగా, షడ్జమము, శుద్ధరిషభము, అంతరగాంధారము, పంచమము. శుద్ధధైవతము కాకలి నిషాదము అనునవి ఇట్లె ఆయా రాగములయొక్క స్వరస్థానములు నివి ఇవి యని గ్రహించవలయును.

## 25. శ్రుతిజేయు పద్ధతి

జంత్రగాత్రాదులయందు సంగీతము నభ్యసించువారలు ముఖ్యముగా శ్రుతిని జేసి కొనేవిధమును దెలిసియుండవలెను. సంగీతమునకు మూలాధారమయినది

శ్రుతి. అట్టి శ్రుతిని దెలిసియుండుట, సంగీత మవలంభించే ప్రతి మనుజునకును, నావశ్యకము. తంబుర యందుగాని ఫిడెల్ యందుగాని శ్రుతిని జేయునప్పుడు తొలుత షడ్జమతంత్రని హెచ్చించి, పీటవద్దనుండి బిరడాలకు సమీపమున నుండే మెట్టువద్దకు ఒకదారమును పై జెప్పిన మెట్టువద్దనుండి కొలిచి, ఆ దారమును మూడుభాగములుచేసి, అందులో ఒకభాగమగు దారమును పై జెప్పిన మెట్టువద్ద నుండి కొలిచి, ఆ కొలతల చివర దేనితోనైనను గుఱుతుజేసి ఆ గుఱుతుమీద మన వ్రేలుఉంచి మీటి నట్టయిన, అది పంచమ స్వరము పలుకును. ఆ నాదములో రెండవతంత్రిని జేర్చినయెడల శ్రుతియౌను. ఆ శ్రుతుని సా, పా, యని యూహించి పాడుకొనవలెను.

ఇట్టి అపూర్వమైన ఈ సులభమార్గము విద్యార్థుల కత్యంతోపయుక్తము.

## 26. ఫిడెల్ వాద్యప్రకరణము

1. ఫిడెలు, వీణె మొదలగు జంత్రవాద్యముల నభ్యసించువారును, గాత్రముల యందు నభ్యసించువారును, ఈ గ్రంథమందుండు స్వరావళి మొదటినుండి గీతముల వఱకు సాధకముచేయు విధ మెటువలెననగా, ఫిడెలునందు ప్రథమకాలముగా స్వరములు వాయించవలసినపుడు, విళంబముగా నొక్కొక కమానుగితకు ఒక్కొకస్వరము పలికేలాగునను, ఆ యొక్క కమానులోని రెండవకాలమున రెండేసి స్వరములు పలికే లాగునను మూడవకాలమున కమాను ఒకటికి నాలుగేసి స్వరముల చొప్పునను, నాల్గవకాలమున కమాను ఒకటికే ఎనిమిదేసి స్వరముల చొప్పునను, ఇవ్విధంబున స్వరావళి, జంట, అలంకారములు, గీతములు మొదలగునవి ఫిడెలునందు సాధకము చేయవలయును.

2. గాత్రములయందు స్వరావళి మొదలగు సాధకము చేయవలసినపుడు, చేతితోవేసెడు తాళాక్షరమునకు, ప్రథమకాలమున వ్రేలికి ఒక స్వరము చొప్పునను, రెండవకాలమున వ్రేలికి రెండేసి స్వరముల చొప్పునను, మూడవకాలమున వ్రేలికి నాలుగేసి స్వరముల చొప్పునను, నాల్గవకాలమున వ్రేలికి ఎనిమిదేసి స్వరముల చొప్పునను తాళమునకు సరిపఱచుకొని గాత్రములయందు సాధకము చేయవలయును. మఱియును, ఫిడెలు వాయించువారికి కమానుయొక్క నడకచేతనే తాళగతిని దెలియుటకు హేతువగుచున్నది. వీణ మొదలగు నఖవాద్యములవారికి మీటుయొక్క నడకయే తాళగతిని దెలుపును. గాత్రపాటకులకు చేతియొక్క నడక వలననే తాళగతి దెలియుచున్నది.

ఈ పై జెప్పిన పద్ధతులప్రకారము స్వరావళి మొదలగునవి అనులోమ, విలోమ క్రమమున సాధకము జేసినయెడల తాళముయొక్క కాలప్రమాణము దృఢపడుటకు హేతువగుచున్నది.

## 27. అనులోమ విలోమక్రమము

అనులోమమనగా— ఫిడెలునందు ప్రథమ కాలముగా కమాను వేయుచు ఆ కమానులోనే క్రమముగా 1-2-3-4 కాలములవఱకు స్వరములను పలికించునది, అనులోమ మనంబడును.

విలోమ మనగా— స్వరములను ప్రథమకాలముగా నడుపుచు, కమానుచేత 1-2-3-4 కాలములుగా వాయించునది విలోమ మనంబడును.

మఱియు, గాత్రమునందు నభ్యసించువారలు చేతిలో ప్రథమకాలముగా తాళమువేయుచు నోటితో 1-2-3-4 కాలములు స్వరముపాడుట అనులోమ మనంబడును. స్వరములను ప్రథమకాలముగా పాడుచు, చేతితోవేసెడి తాళాక్షరములను 1-2-3-4 కాలములు నడిపించునది విలోమమనంబడును. ఇట్లు స్వరములన్నిటియందును, అనులోమ విలోమక్రమమున సాధకము చేయవలయును.

## 28. వీణెవాద్యప్రకరణము

వీణెకు సప్తతంత్రులుగలవు. అందు 1 అనుమందరము, 2 మందరము, 3 మందర పంచమము, 4 షడ్జమము, యీ నాల్గున్నూ పైనవేయు తంత్రులు. ప్రక్కన శృతికి, తాళమున కుపయుక్తముగ మూడుతంత్రు లమర్చియుండును. 1 షడ్జమము 2 పంచమము, 3 తారము కలవు. వాయించునప్పుడు కుడిచేతితో మీటుచూ దాని కమర్చియున్న 24 మెట్లనగా రెండు స్థాయలు, దానిలో స్వరములను యెడమచేతి యొక్క వ్రేళ్ళతో మెట్టుమీద అదిమిపెట్టి ఆయా స్వరములను, పలికించవలయును. షడ్జమము నాల్గవతీగెయై యున్నది. ఆ తీగెయే మధ్యమ స్థాయికి ప్రారంభషడ్జమము. అందువల్ల మీటినయెడల అషడ్జమమే పల్కును. ప్ర శుద్ధరిషభము, మేరువుగాక మొదటిమెట్టు శుద్ధరిషభము పల్కును. నాల్గవ మెట్టు అంతరగాంధారము. అయిదవమెట్టు శుద్ధమధ్యమము. యేడవమెట్టు పంచమము, యెనిమిదవమెట్టు శుద్ధదైవతము, పదకొండవమెట్టు కాకలినిషాదము, పన్రెండవమెట్టు తారషడ్జమము నుపయోగించిన యెడల మనకు సంగీతమునకు ప్రారంభించు మాయామాళవగౌళ రాగ స్థానములగును. విశేషములన్ని గురుముఖత తెలుసుకొనవలయును.

## 29. గోటువాయిద్య ప్రకరణము

ఈ వాయిద్యము వీణె ననుసరించియె యన్నివిషయము లుండును, కాని వీణెకు వేయునట్టి మెట్లుండవు. వీణెమాదిరిగానే మీటుచు యెడమచేతిన యొక చిన్నకొయ్య ముక్కను పట్టుకొని దానితోటి పై తంత్రులమీదా దా యా స్వరముల ధ్వనులనుబట్టి వాయించవలయును.

### 30. ఫ్లూటు వాయిద్య ప్రకరణము

ఇది వేణు (అనగా వెదురు) చేత తయారు చేయబడి సప్తరంధ్రములు వేసి దానియొక్క మొదటిలో యొక పెద్ద రంధ్రమునువేసి దానిలోనే గాలివదలుచు యీ యేడు రంధ్రములనే సగమునూత, పాతికమూత వ్రేళ్ళతో మూయుటవల్ల పదు నారు స్థానములు గల్గుచున్నవి. అనుభవవేద్యము.

---

శ్రీరస్తు

# రాగప్రకరణము

## రాగశబ్దార్థము

శ్లో॥ యోయంధ్వని విశేషస్తు స్వరవర్ణ విభూషితః ।
రంజకోజన చిత్తానాం సరాగః కథితోబుధైః ॥

తా॥ రాగ మనగా, స్వరవర్ణములచే అలంకరింపబడి, జనుల చిత్తమును ఆనందింపచేయునట్టి ధ్వని విశేషము రాగ మనంబడును.

శ్లో॥ స్థాయారోహా వరోహేచ సంచారీత్యథ లక్షణమ్ ।
స్థిత్వాస్థిత్వా ప్రయోగ స్స్యాదేకైకస్య స్వరస్యయః ॥

శ్లో॥ స్థాయీ వర్ణస్సవిజ్ఞేయః పరావస్వరనామకౌ ।
ఏతత్సమ్మిశ్రణాద్వర్ణ స్సంచారీ పరికీర్తితః ॥

తా॥ రాగము-స్థాయి, ఆరోహి, అవరోహి, సంచారి యని నాలుగువిధములు. అందు ఒక్కొక్క స్వరమును విళంబముగా నిలిపి నిలిపిపాడుట స్థాయి యనఁ బడును. స్వరములు సరిగమపధనిస యని క్రమముగా హెచ్చుట ఆరోహి యనఁబడును. సనిధపమగరిస యని క్రమముగా తగ్గుట అవరోహి యనఁబడును. ఈ మూటియొక్క చేరిక సంచారి యనఁబడును.

శ్లో॥ షాడవౌడవ సంపూర్ణ భేదాద్రాగ స్త్రిధామతః ।
ఔడవః పంచభిఃప్రోక్త స్స్వరైషడ్భిస్తుషాడవః ।
సంపూర్ణ స్సప్తభిర్జ్ఞేయ ఏవంరాగ స్త్రిధామతః ॥

తా॥ రాగములు – షాడవము, ఔడవము, సంపూర్ణము అని మూడు విధములు. అందు ఔడవము ఐదు స్వరములును, షాడవము ఆఱు స్వరములును; సంపూర్ణము సప్త స్వరములును, కలిగియుండును.

## ఉదాహరణము

| | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|
| సంపూర్ణము ... | స రి గ మ ప ధ ని స | – స ని ధ ప మ గ రి స॥ |
| షాడవము ... | స రి గ మ ప ధ స | – స ధ ప మ గ రి స ॥ |
| ఔడవము ... | స రి గ మ ప స | – స ప మ గ రి స ॥ |

ఈ సంపూర్ణ షాడవ ఔడవములలో సంపూర్ణము ఒక్క భేదమును, షాడవము ఆఱు భేదములును, ఔడవము పదిహేను భేదములును గలిగి ఇరువదిరెండు భేదంబు లయ్యెను.

## న్యాసాంశ గ్రహస్వర లక్షణము

శ్లో॥ గీతాదౌ స్థాపితోయస్తు సగ్రహస్వర ఉచ్యతే ।
న్యాసస్వరస్తు విజ్ఞేయో యస్తగీత సమాపకః ।
బహుళోయః ప్రయోగేషు సోయమంశ స్వరోమతః ॥

తా॥ రాగము నారంభించు నపుడేమి, మధ్య మధ్య సంగతి నారంభించు నపుడేమి, ఆ స్వరములోనే నిలుపబడినది, గ్రహస్వర లేక ఎడ్పు యనంబడును. ఒక్కొక్క రాగమును ఆలాపించునపుడు సంగతి విన్యాసముయొక్క చివరస్వరము మీద నిలుపుట న్యాస స్వర మనఁబడును. ఆయా రాగములలో సంగతివేసి పాడునప్పుడు ప్రయోగములందు విస్తారమై మాటిమాటికి ఉపయోగింపబడి రక్తియిచ్చునట్టి స్వరము అంశ స్వర మనంబడును. ఇట్లు ఆయా రాగములయొక్క రూపమేర్పడుటకు న్యాసాంశ గ్రహస్వరములు ఈయీ రాగములకు నివి యివి యని ప్రాచీనులు కొన్ని రాగములకు నిర్ణయించి యున్నారు.

## వందనశ్లోకము

శ్లో॥ చైతన్యం సర్వభూతానాం నిర్వృతిర్జగదాత్మనామ్ ।
నాదబ్రహ్మ తదానంద మద్వితీయ ముపాస్మహే ॥

సంగీతము నాదప్రధానంబై జంత్ర గాంత్రములయందు స్వర విన్యాసముచే నవ్యక్త మధురమై, శిశుపశు ఫణ్యాదులకును బారవశ్య దాయకంబై ఐహికాముష్మిక సుఖదాయకంబునై యొప్పుచుండు శాస్త్రము. అట్టి సంగీత శాస్త్రమును యభ్యసించువారలు తొలుత శ్రుతి గూర్చుకొని పిమ్మట సరిగమపదనిస సనిధపమగరిస అను నీ స్వరములను ఆరోహణ అవరోహణ గతిగా, ఆదితాళము వేసికొని, కాలము దెలిసి హెచ్చు తక్కువలు గానీయక తాళమునకు సరిపరచుకొని, ముందర విళంబముగా ప్రథమ కాలము, పిమ్మట ద్వితీయ కాలమును అనంతరము తృతీయ కాలమును, తదనంతరము చతుర్థ కాలమును క్రమముగా ఆ రాగముయొక్క స్వరస్థానములను గుఱు తెఱిగి సాధకము చేయవలెను.

మఱియును, ఆదితాళము ఒక్క లఘువును, రెండు ద్రుతములును గలది. దీనికి అంగసంజ్ఞ 100 ఇందు నిలువుగీటు గల గుఱుతు లఘు వనియు, రెండుసున్నాలు రెండు ద్రుతము లనియు నెఱుంగవలెను. ఈ ఆదితాళముయొక్క లఘుద్రుతములను వేసెడి క్రమ మెటువలె నంటే, తొలుత లఘువును, పిమ్మట రెండు ద్రుతములను వేయవలెను. లఘువు అనగా, ఘాత మొదలు ప్రేలువఱకు నాలుగక్షరములు వేయునది.

ద్రుత మనగా, దెబ్బ ఉసివేయుట. అందు ఉసి యనగా, దెబ్బవేసిన చేతిని కుడివైపుకు విసరుట ఇట్లే రెండవ ద్రుతమున్ను వేయవలెను. దీని వివర మీ క్రింద వ్రాయబడుచున్నది.



# 1. రాగ స్వరావళీ వరుసలు

ఆ. సరిగమపధనిస̇

అ. స̇నిధపమగరిస

స-శురి-అంగ-శుమ-ప శుధ-కాని

## మాయామాళవగౌళ రాగము - ఆదితాళము 8 అక్షరములు

| । ఇది లఘువు | | | | O ఇది ద్రుతము | | O ఇద ద్రుతము | |
|---|---|---|---|---|---|---|---|
| ఘాత | చిటికన వ్రేలు | అనామిక వ్రేలు | మధ్య వ్రేలు | దెబ్బ | ఉసి | దెబ్బ | ఉసి |
| | | | ప్రథమ | కాలము | | | |
| స | రి | గ | మ | ప | ధ | ని | స̇ |
| స̇ | ని | ధ | ప | మ | గ | రి | స |
| | | | రెండవ | కాలము | | | |
| స రి | గ మ | ప ధ | ని స̇ | స̇ ని | ధ ప | మ గ | రి స |
| | | | మూడవ | కాలము | | | |
| స రి గ మ | ప ధ ని స̇ | స̇ ని ధ ప | మ గ రి స | స రి గ మ | ప ధ ని స̇ | స̇ ని ధ ప | మ గ రి స॥ |
| | | | నాల్గవ | కాలము | | | |
| సరిగమపధనిస̇ | స̇నిధపమగరిస | సరిగమపధనిస̇ | స̇నిధపమగరిస | సరిగమపధనిస̇ | స̇నిధపమగరిస | సరిగమపధనిస̇ | స̇నిధపమగరిస |

ఇట్లు ఈ క్రింద వ్రాసియుండు స్వరముల అన్నిటియందును, పైజెప్పిన 1, 2, 3, 4 కాలముల పద్ధతిని సాధకము చేయవలయును.

| | I<br>4 అ.<br>దె-వ్రే1-2-3 | O<br>2 అ.<br>దె-ఉ | O<br>2 అ.<br>దె-ఉ | I<br>4 అ.<br>దె-వ్రే1-2-3 | O<br>2 అ.<br>దె-ఉ | O<br>2 అ.<br>దె-ఉ |
|---|---|---|---|---|---|---|
| 2 | స రి గ మ<br>స̇ ని ధ ప | స రి<br>స̇ ని | గ మ<br>ధ ప | స రి గ మ<br>స̇ ని ధ ప | ప ధ<br>మ గ | ని స̇<br>రి స॥ |
| 3 | స రి గ మ<br>స̇ ని ధ ప | స రి<br>స̇ ని | స రి<br>స̇ ని | స రి గ మ<br>స̇ ని ధ ప | ప ధ<br>మ గ | ని స̇<br>రి స॥ |
| 4 | స రి గ మ<br>స̇ ని ధ ప | పా<br>మా | స రి<br>స ని | స రి గ మ<br>స̇ ని ధ మ | ప ధ<br>మ గ | ని స̇<br>రి స॥ |
| 5 | స రి గ మ<br>స̇ ని ద ప | ప మ<br>మ ప | గ రి<br>ధ ని | స రి గ మ<br>స̇ ని ధ ప | ప ధ<br>మ గ | ని స̇<br>రి స॥ |
| 6 | స రి గ మ<br>స̇ ని ధ ప | ప మ<br>మ ప | ధ ప<br>గ మ | స రి గ మ<br>స̇ ని ధ ప | ప ధ<br>మ గ | ని స̇<br>రి స॥ |
| 7 | స రి గ మ<br>స̇ ని ధ ప | స మ<br>స ప | గ రి<br>ధ ని | స రి గ మ<br>స̇ ని ధ ప | ప ధ<br>మ గ | ని స̇<br>రి స॥ |
| 8 | స రి గ మ<br>గ మ ప ధ | పా<br>ని ధ | గ మ<br>ప మ | పా , ,<br>గ మ ప గ | పా<br>మ గ | , ,<br>రి స॥ |
| 9 | సా̇ ని ధ<br>గ మ ప ధ | నీ<br>ని ధ | ధ ప<br>ప మ | ధా ప మ<br>గ మ ప గ | పా<br>మ గ | పా<br>రి స॥ |
| 10 | స రి గ మ<br>నీ నీ<br>పా పా<br>స̇ ని ధ ప | ప ధ<br>ధ ప<br>మ గ<br>మ గ | ని స̇<br>ధ ని<br>మ ప<br>రి స | రీ సా̇<br>ధా ధా<br>మా మా<br>స̇ ని ధ ప | ని ధ<br>ప మ<br>గ రి<br>మ గ | ని స̇<br>ప ధ<br>గ మ<br>రి స॥ |

# 2. హెచ్చు స్థాయి వరుసలు

## ధీర శంకరాభరణ రాగము - ఆదితాళము 8 అ.

29 వ మేళకర్త రాగము — ఆరో. సరిగమపధనిస̇.

స-చరి-అంగ-శుమ-ప-చధ-కాని — అవ. స̇నిధపమగరిస.

| | I 4 అ. దె-త్రి-2-3 | O 2 అ. దె-ఉ | O 2 అ. దె-ఉ | I 4 అ. దె-త్రి-2-3 | O 2 అ. దె-ఉ | O 2 అ. దె-ఉ |
|---|---|---|---|---|---|---|
| 1 | స రి గ మ | ప ధ | ని స̇ | సా̇ , , | సా̇ | , , |
| | ధ ని స̇ రి̇ | స̇ ని | ధ ప | స̇ ని ధ ప | మ గ | రి స ‖ |
| 2 | స రి గ మ | ప ధ | ని స̇ | సా̇ , , | సా̇ | , , |
| | ధ ని స̇ రి̇ | స̇ స̇ | రి̇ స̇ | స̇ రి̇ స̇ ని | ధ ప | మ ప |
| | ధ ని స̇ రి̇ | స̇ ని | ధ ప | స̇ ని ధ ప | మ గ | రి స ‖ |
| 3 | స రి గ మ | ప ధ | ని స̇ | సా̇ , , | సా̇ | , , |
| | ధ ని స̇ రి̇ | గ̇ రి̇ | స̇ రి̇ | స̇ రి̇ స̇ ని | ధ ప | మ ప |
| | ధ ని స̇ రి̇ | స̇ స̇ | రి̇ స̇ | స̇ రి̇ స̇ ని | ధ ప | మ ప |
| | ధ ని స̇ రి̇ | స̇ ని | ధ ప | స̇ ని ధ ప | మ గ | రి స ‖ |
| 4 | స రి గ మ | ప ధ | ని స̇ | సా̇ , , | సా̇ | , , |
| | ధ ని స̇ రి̇ | గ̇ మ̇ | గ̇ రి̇ | స̇ రి̇ స̇ ని | ధ ప | మ ప |
| | ధ ని స̇ రి̇ | గ̇ రి̇ | స̇ రి̇ | స̇ రి̇ స̇ ని | ధ ప | మ ప |
| | ధ ని స̇ రి̇ | స̇ స̇ | రి̇ స̇ | స̇ రి̇ స̇ ని | ధ ప | మ ప |
| | ధ ని స̇ రి̇ | స̇ ని | ధ ప | స̇ ని ధ ప | మ గ | రి స ‖ |
| 5 | స రి గ మ | ప ధ | ని స̇ | సా̇ , , | సా̇ | , , |
| | ధ ని స̇ రి̇ | గ̇ మ̇ | ప̇ మ̇ | గ̇ మ̇ గ̇ రి̇ | స̇ ని | ధ ప |
| | ధ ని స̇ రి̇ | గ̇ మ̇ | గ̇ రి̇ | స̇ రి̇ స̇ ని | ధ ప | మ ప |
| | ధ ని స̇ రి̇ | గ̇ రి̇ | స̇ రి̇ | స̇ రి̇ స̇ ని | ధ ప | మ ప |
| | ధ ని స̇ రి̇ | స̇ స̇ | రి̇ స̇ | స̇ రి̇ స̇ ని | ధ ప | మ ప |
| | ధ ని స̇ రి̇ | స̇ ని | ధ ప | స̇ ని ధ ప | మ గ | రి స ‖ |

# 3. తగ్గు స్థాయి వరుసలు

## మాయామాళవగౌళ రాగము - ఆదితాళము 8 అ.

15 వ. మేళకర్త రాగము — ఆరో. సరిగమపధనిస̇

స-శురి-అంగ-శుమ-పశుధ-కాని — అవ. స̇నిధపమగరిస

| | I<br>4 అ<br>దె-త్రే1-2-3 | O<br>2 అ<br>దె-ఉ | O<br>2 అ<br>దె-ఉ | I<br>4 అ<br>దె-త్రే1-2-3 | O<br>2 అ<br>దె-ఉ | O<br>2 అ<br>దె-ఉ |
|---|---|---|---|---|---|---|
| 1 | స̇ ని ధ ప<br>గ రి స ని̣ | మ గ<br>స రి | రి స<br>గ మ | సా , ,<br>స రి గ మ | సా<br>ప ద | , ,<br>ని స̇ ‖ |
| 2 | స̇ ని ధ ప<br>గ రి స ని̣<br>గ రి స ని̣ | మ గ<br>స స<br>స రి | రి స<br>ని̣ స<br>గ మ | సా , ,<br>స ని̣ స రి<br>స రి గ మ | సా<br>గ మ<br>ప ద | , ,<br>ప మ<br>ని స̇ ‖ |
| 3 | స̇ ని ధ ప<br>గ రి స ని̣<br>గ రి స ని̣<br>గ రి స ని̣ | మ గ<br>ధ̣ ని̣<br>స స<br>స రి | రి స<br>స ని̣<br>ని̣ స<br>గ మ | సా , ,<br>స ని̣ స రి<br>స ని̣ స రి<br>స రి గ మ | సా<br>గ మ<br>గ మ<br>ప ద | , ,<br>ప మ<br>ప మ<br>ని స ‖ |
| 4 | స̇ ని ధ ప<br>గ రి స ని̣<br>గ రి స ని̣<br>గ రి స ని̣<br>గ రి స ని̣ | మ గ<br>ధ̣ ప̣<br>ధ̣ ని̣<br>స స<br>స రి | రి స<br>ధ̣ ని̣<br>స ని̣<br>ని̣ స<br>గ మ | సా , ,<br>స ని̣ స రి<br>స ని̣ స రి<br>స ని̣ స రి<br>స రి గ మ | సా<br>గ మ<br>గ మ<br>గ మ<br>ప ధ | , ,<br>ప మ<br>ప మ<br>ప మ<br>ని స ‖ |
| 5 | స̇ ని ధ ప<br>స ని̣ ధ̣ ని̣<br>రి గ మ గ<br>మ ప ప ద | మ గ<br>ని̣ స<br>రి గ<br>ప మ | రి స<br>రి స<br>గ మ<br>గ రి | సా , ,<br>ని̣ స స రి<br>ప మ గ మ<br>స రి గ మ | సా<br>గ రి<br>మ ప<br>ప ద | , ,<br>స రి<br>ధ ప<br>ని స̇ ‖ |
| 6 | స̇ ని ధ ప<br>స ని̣ ధా̣<br>రి గ మ గ<br>మా ప ద | మ గ<br>ని̣ స<br>రీ<br>ప మ | రి స<br>రి స<br>గ మ<br>గ రి | సా̇ , ,<br>నీ̣ స రి<br>ప మ గా<br>స రి గ మ | సా<br>గ రి<br>మ ప<br>ప ద | , ,<br>సా<br>ధ ప<br>ని స̇ ‖ |

## 4. జంటవరుసలు

### మాయామాళవగౌళ రాగము - ఆదితాళము 8 అ.

15 వ మేళకర్త రాగము — ఆరో. సరిగమపధనిస̇

స-శురి-అంగ-శుమ-ప-శుధ-కాని. — అవ. స̇నిధపమగరిస

| | I 4 అ. దె-వ్రే1-2-3 | O 2 అ. దె-ఉ | O 2 అ. దె-ఉ | I 4 అ. దె-వ్రే1-2-3 | O 2 అ. దె-ఉ | O 2 అ. దె-ఉ |
|---|---|---|---|---|---|---|
| 1 | స స రి రి | గ గ | మ మ | ప ప ద ధ | ని ని | స̇ స̇ |
| | స̇ స̇ ని ని | ద ధ | ప ప | మ మ గ గ | రి రి | స స ‖ |
| 2 | స స రి రి | గ గ | మ మ | రి రి గ గ | మ మ | ప ప |
| | గ గ మ మ | ప ప | ద ధ | మ మ ప ప | ద ధ | ని ని |
| | ప ప ద ధ | ని ని | స̇ స̇ | స̇ స̇ ని ని | ద ధ | ప ప |
| | ని ని ద ధ | ప ప | మ మ | ద ధ ప ప | మ మ | గ గ |
| | ప ప మ మ | గ గ | రి రి | మ మ గ గ | రి రి | స స ‖ |
| 3 | స స రి రి | గ గ | రి రి | స స రి రి | గ గ | మ మ |
| | రి రి గ గ | మ మ | గ గ | రి రి గ గ | మ మ | ప ప |
| | గ గ మ మ | ప ప | మ మ | గ గ మ మ | ప ప | ద ధ |
| | మ మ ప ప | ద ధ | ప ప | మ మ ప ప | ద ధ | ని ని |
| | ప ప ద ధ | ని ని | ద ధ | ప ప ద ధ | ని ని | స̇ స̇ |
| | స̇ స̇ ని ని | ద ధ | ని ని | స̇ స̇ ని ని | ద ధ | ప ప |
| | ని ని ద ధ | ప ప | ద ధ | ని ని ద ధ | ప ప | మ మ |
| | ద ధ ప ప | మ మ | ప ప | ద ధ ప ప | మ మ | గ గ |
| | ప ప మ మ | గ గ | మ మ | ప ప మ మ | గ గ | రి రి |
| | మ మ గ గ | రి రి | గ గ | మ మ గ గ | రి రి | స స ‖ |
| 4 | స రి రి గ | స రి | రి గ | స స రి రి | గ గ | మ మ |
| | రి గ గ మ | రి గ | గ మ | రి రి గ గ | మ మ | ప ప |
| | గ మ మ ప | గ మ | మ ప | గ గ మ మ | ప ప | ద ధ |
| | మ ప ప ధ | మ ప | ప ధ | మ మ ప ప | ద ధ | ని ని |
| | ప ద ధ ని | ప ద | ధ ని | ప ప ద ధ | ని ని | స̇ స̇ |
| | స̇ ని ని ధ | స̇ ని | ని ధ | స̇ స̇ ని ని | ద ధ | ప ప |
| | ని ద ధ ప | ని ద | ధ ప | ని ని ద ధ | ప ప | మ మ |
| | ధ ప ప మ | ధ ప | ప మ | ద ధ ప ప | మ మ | గ గ |
| | ప మ మ గ | ప మ | మ గ | ప ప మ మ | గ గ | రి రి |
| | మ గ గ రి | మ గ | గ రి | మ మ గ రి | రి రి | స స ‖ |

## 5. దాటు వరుసలు

### మాయామాళవగౌళ రాగము - ఆదితాళము 8 అ.

15 వ మేళకర్త రాగము — ఆరో. సరిగమపధనిస̇

స-శురి-అంగ-శుమ-ప-శుధ-కాని — అవ. స̇నిధపమగరిస

| | I 4 అ దె-ద్రే1-2-3 | O 2 అ దె-ఉ | O 2 అ దె-ఉ | I 4 అ దె-ద్రే1-2-3 | O 2 అ దె-ఉ | O 2 అ దె-ఉ |
|---|---|---|---|---|---|---|
| 1 | స రి స గ | రి గ | మ గ | స గ రి గ | స రి | గ మ |
| | రి గ రి మ | గ మ | ప మ | రి మ గ మ | రి గ | మ ప |
| | గ మ గ ప | మ ప | ద ప | గ ప మ ప | గ మ | ప ధ |
| | మ ప మ ధ | ప ధ | ని ధ | మ ద ప ధ | మ ప | ద ని |
| | ప ద ప ని | ద ని | స̇ ని | ప ని ద ని | ప ధ | ని స̇ |
| | స̇ ని స̇ ధ | ని ధ | ప ధ | స̇ ద ని ధ | స̇ ని | ధ ప |
| | ని ధ ని ప | ధ ప | మ ప | ని ప ధ ప | ని ధ | ప మ |
| | ద ప ధ మ | ప మ | గ మ | ద మ ప మ | ధ ప | మ గ |
| | ప మ ప గ | మ గ | రి గ | ప గ మ గ | ప మ | గ రి |
| | మ గ మ రి | గ రి | స రి | మ రి గ రి | మ గ | రి స ॥ |
| 2 | స గ స రి | గ రి | మ గ | స మ రి గ | స రి | గ మ |
| | రి మ రి గ | మ గ | ప మ | రి ప గ మ | రి గ | మ ప |
| | గ ప గ మ | ప మ | ద ప | గ ద మ ప | గ మ | ప ధ |
| | మ ద మ ప | ద ప | ని ధ | మ ని ప ధ | మ ప | ధ ని |
| | ప ని ప ధ | ని ధ | స̇ ని | ప స̇ ద ని | ప ధ | ని స̇ |
| | స̇ ద స̇ ని | ద ని | ప ధ | స̇ ప ని ధ | స̇ ని | ధ ప |
| | ని ప ని ధ | ప ధ | మ ప | ని మ ద ప | ని ధ | ప మ |
| | ద మ ధ ప | మ ప | గ మ | ద గ ప మ | ధ ప | మ గ |
| | ప గ ప మ | గ మ | రి గ | ప రి మ గ | ప మ | గ రి |
| | మ రి మ గ | రి గ | స రి | మ స గ రి | మ గ | రి స ॥ |

టీక :— నారదోఽపి = నారదమహామునికూడ, తంత్రీ ప్రకర్ష, మధుర. స్వనయా = తంత్రులయొక్క పట్టుచే మధురమైన శబ్దముగల, విపంచ్యా = ఏడు తంతులు గల విపంచియను వీణావాద్యముచే, భాషాసమగ్రం = భాషామయ మైనట్టియు, లేదా భాషచే సమగ్రమైనటువంటియు. అసకృత్కర చారరమ్యం=మాటిమాటికిని చేయాడింపులచే మనోహరమును అగు ! తవ = నీయొక్క, అనంత చరితం = తుదిలేని చరితమును, లేక, అనంత = తుదిలేనివాడా ! తవ = నీయొక్క ; చరితం = చరితమును అనికూడ చెప్పనగును, గాయతి=గానముచేయుచున్నాడు ; శేషాద్రిశేఖరవిభో= శేషాచలాధిపతీ ! తవ = నీకు ; సుప్రభాతం = సుప్రభాతము (అగుగాక).

తా॥ నారదమహాముని తంతులనీడ్చి పట్టుటచే మధురనాదము గల వీణతోగూడ భాషామయమైన నీ యనంతచరితమును పలుమారు రమ్యముగా చేయాడించుచు గానముచేయుచున్నాడు. ఓ శేషాచలపతీ ! నీకు సుప్రభాత మగుగాక !

శ్లో॥ భృంగావళీ చ మకరందరసానువిద్ధ
ఝుంకారగీతనినదైః సహ సేవనాయ ।
నిర్యాత్యుపాంత సరసీకమలోదరేభ్యః
శేషాద్రిశేఖరవిభో తవ సుప్రభాతమ్ ॥ ౧౦

టీక :— భృంగావళీ చ = తుమ్మెదల గుంపు, మకరంద, రసానువిద్ధ, ఝుంకారగీత నినదైః సహ = (మకరందమను) పూదేనెను పానము చేయుటవలన గలిగిన ఝుంకారమను గీతికాధ్వనులతో ; సేవనాయ = ( మిమ్ము ) సేవించుటకు ; సరసీ,

కమలోదరేభ్యః = తటాకములందలి తామరపూవుల మధ్యనుండి ; నిర్యాతి = బయటికి వచ్చుచున్నది, శేషాద్రిశేఖరవిభో = ఓ శేషాద్రి నాథా ! తవ = నీకు ; సుప్రభాతం = సుప్రభాతము (అగుగాక).

తా॥ తుమ్మెదపిండు మకరందరస పానముచే విజృంభించిన ఝుంకార గీతముల ధ్వనులతో సమీప సరస్సులందలి తామరపూవులలోనుండి వెలువడి మిమ్ము సేవించుటకు వచ్చుచున్నది. ఓ శేషాచలపతీ ! నీకు సుప్రభాత మగుగాక.

శ్లో॥ యోషాగణేన వరదధ్ని విమథ్యమానే
ఘోషాలయేషు దధిమంథనతీవ్రఘోషాః ।
రోషాత్కలిం విదధతే కకుభశ్చ కుంభాః
శేషాద్రిశేఖరవిభో తవ సుప్రభాతమ్ ॥ ౧౧

టీక :— ఘోషాలయేషు = గొల్లయిండ్ల యందు, యోషాగణేన = స్త్రీ జనముచేత, వరదధ్ని = శ్రేష్ఠమైన పెరుగు, విమథ్యమానే సతి = చిలుకబడిన దగుచుండగా, దధిమంథన, తీవ్ర, ఘోషాః = పెరుగు చిలుకుటవలన కల్గిన తీవ్రమైన శబ్దముగల, కకుభః = దిక్కులున్ను ; కుంభాశ్చ = కడవలును, రోషాత్ = కోపమువలన, కలిం = కలహమును, విదధతే = సల్పుచున్నవి (వలెనే యున్నవి). శేషాద్రిశేఖరవిభో = శేషాద్రిపర్వతమందున్న యోవిష్ణుమూర్తీ ! తవ = నీకు, సుప్రభాతం = సుప్రభాతము (అగుగాక).

తా॥ గొల్లయిండ్లలో గొల్లభామలు పెరుగు చిలుకుచున్నారు. ఆ చిలికిన చప్పుడు ప్రతిధ్వనించుచు, పెరుగు కడవలును, దిక్కులును తగవులాడుచున్నవా యనునట్లు ఘోషించుచున్నది. ఓ వేంకటాచలపతీ ! నీకు సుప్రభాత మగుగాక.

శ్లో॥ పద్మేశమిత్రశతపత్రగతాళివర్గాః
హర్తుం శ్రియం కువలయస్య నిజాంగలక్ష్మ్యా ।
భేరీనినాదమివ బిభ్రతి తీవ్రనాదం
శేషాద్రి శేఖరవిభో తవ సుప్రభాతమ్ ॥ ౧౨

టీక :— పద్మేశ. మిత్ర. శతపత్రగతాళివర్గాః = కమలనాథుడగు సూర్యునకు మిత్రములైన శతపత్రములను, తామరపూవులందున్న తుమ్మెదపిండులు ; నిజాంగలక్ష్మ్యా = తమ దేహకాంతిచేత, కువలయస్య = నల్లికలువయొక్క, శ్రియం = కాంతిని, హర్తుం = అపహరించుటకై, భేరీనినాదమివ = భేరీనాదమును (చేయునవి) వలెనే, తీవ్రనాదం = పెద్ద ధ్వనిని, బిభ్రతి = వహించుచున్నవి, శేషాద్రిశేఖరవిభో = ఓ శేషాద్రిశిఖరమందలి విష్ణుమూర్తీ ! తవ = నీకు ; సుప్రభాతం = సుప్రభాతము (అగుగాక).

తా॥ పద్మినీవల్లభుడగు సూర్యునికి మిత్రములైన తామరలయందుండు తుమ్మెదలు తమ దేహకాంతిచే కలువల నల్లని కాంతిని హరించుటకై భేరీ వాయించువవి వలెనే తీవ్రనాదము చేయుచున్నవి. ఓ వేంకటాచలపతీ ! నీకు సుప్రభాత మగుగాక.

శ్లో॥ శ్రీమన్నభీష్టవరదాఖిలలోకబంధో
శ్రీ శ్రీనివాస జగదేకదయైకసింధో ।
శ్రీదేవతాగృహభుజాంతరదివ్యమూర్తే
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥ ౧౩

టీక :— శ్రీమన్ = లక్ష్మీయుక్తుడా ; అభీష్టవరద ! = కోరిన వరముల నొసగువాడా ; అఖిలలోకబంధో ! = సమస్తలోక

ములకు బంధువైనవాడా ; శ్రీ శ్రీనివాస ! = పూజ్యురాలైన లక్ష్మీ దేవికి నివాసస్థలమైనవాడా ; జగదేక దయైక సింధో = జగమునం దంతటను (జగత్తుకంతటికిని) అద్వితీయుడవైన (ఒక్కడవేయైన) దయాసముద్రుడా ; శ్రీ దేవతాగృహ భుజాంతర దివ్యమూర్తే : = లక్ష్మీదేవికి నివాసమైన భుజాంతరము ( వక్షము ) చేత మనోహర మైన యాకృతి గలవాడా ; శ్రీ వేంకటాచలపతే = ఓ సంపద్యుక్త వేంకటాచలపతీ ! తవ = నీకు ; సుప్రభాతం = సుప్రభాతము (అగుగాక).

తా॥ శ్రీమంతుడవగు నో వేంకటాచలపతీ ! కోరిన వరములనెల్ల నొసగువాడవు. సకలలోక బాంధవుడవు. పూజ్యురాలగు లక్ష్మీదేవికి నివాస్థానమైనవాడవు. జగత్తులో నీవే దయానిధివి. లక్ష్మీదేవికి నివాస మగు పెన్నురముచే మనోహరమగు మూర్తిగలవాడవు. స్వామీ ! నీకు సుప్రభాత మగుగాక.

శ్లో॥ శ్రీ స్వామిపుష్కరిణికాఽఽప్లవ నిర్మలాంగాః
శ్రేయోఽర్థినో హరవిరించిసనందనాద్యాః ।
ద్వారే వసంతి వరవేత్రహతోత్తమాంగాః
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥ ౧౪

టీక : — శ్రీ స్వామిపుష్కరిణికాఽఽప్లవ, నిర్మలాంగాః = శ్రీ స్వామిపుష్కరిణియందు మునుగుటచే, నిర్మలమైన దేహము గలవారై ; శ్రేయోఽర్థినః = శ్రేయస్సు కోరువారగుచు ; హర, విరించి, సనందనాద్యాః = ఈశ, బ్రహ్మ, సనందనాదులు ; వర వేత్రహతోత్తమాంగాః = ( ద్వారపాలకులచే ) శ్రేష్ఠములైన పేము బెత్తములచే గొట్టబడిన శిరములు గలవారగుచు ; ద్వారే = ద్వారము

నందు ; వసంతి = వేచియున్నారు. శ్రీ వేంకటాచలపతే ! = ఓ వేంకటాచలపతీ ! తవ = నీకు ; సుప్రభాతం = సుప్రభాతము (అగుగాక)

తా॥ బ్రహ్మ, మహేశ్వరుడు, సనందనమహర్షి మొదలగు వారందరును, శ్రేయస్సుకొరకు శ్రీ స్వామిపుష్కరిణియందు మునిగి నిర్మల దేహులైవచ్చి తలలపై బెత్తపుదెబ్బలను తినుచు, వాకిట వేచియున్నారు. ఓవేంకటాచలపతీ ! నీకు సుప్రభాత మగుగాక.

శ్లో॥ శ్రీ శేషశైల గరుడాచల వేంకటాద్రి
నారాయణాద్రి వృషభాద్రి వృషాద్రిముఖ్యామ్ ।
ఆఖ్యాం త్వదీయవసతే రనిశం వదంతి
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥ ౧౫

టీక :— త్వదీయవసతేః = నీ నివాసమునకు ; శ్రీ శేషశైల, గరుడాచల, వేంకటాద్రి, నారాయణాద్రి, వృషభాద్రి, వృషాద్రి ముఖ్యాం = శేషాచలమని, గరుడాచలమని, వేంకటాద్రి, లేక వేంకటాచలమని, నారాయణాద్రియని, వృషభాద్రియని, వృషాద్రి యని, ముఖ్యాం = మొదలుగాగల ; ఆఖ్యాం = నామములను ; అనిశం = ఎల్లప్పుడును ; వదంతి = నుడువుచున్నారు, శ్రీ వేంకటాచలపతే = శ్రీ వేంకటాచలపతీ ! తవ = నీకు ; సుప్రభాతం = సుప్రభాతము (అగుగాక).

తా॥ ఓ వేంకటాచలపతీ ! నీ నివాసమగు ఈ తిరుమల కొండను శేషాద్రి, గరుడాచలము, వేంకటగిరి, నారాయణగిరి, వృషభాచలము, వృషాద్రి మొదలగు నామములతో పేర్కొందురు. నీకు సుప్రభాత మగుగాక.

శ్లో॥ సేవాపరాః శివసురేశకృశానుధర్మ
రక్షోఽంబునాథ పవమాన ధనాధినాథాః ।
బద్ధాంజలిప్రవిలసన్నిజశీర్షదేశాః
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥ ౧౬

టీక :— శివ, సురేశ, కృశాను, ధర్మ, రక్షః, అంబునాథ, పవమాన, ధనాధినాథాః = ఈశ్వరుడు, దేవేంద్రుడు, అగ్ని, యమ ధర్మరాజు, నైఋతి, వరుణుడు, వాయువు, కుబేరుడు నగు నష్ట దిక్పాలురును ; బద్ధాంజలి. ప్రవిలస న్నిజశీర్షదేశాః = (నమస్కార మునకై) కూర్పబడిన కైమోడ్పులచే ప్రకాశించు శిరోభాగములు గలవారై అనగా నంజలుల శిరమున దాల్చువారగుచు, సేవాపరాః = (మీకు) సేవజేయుటయం దాసక్తిగలవారై (యున్నారు). శ్రీ వేంకటాచలపతే = ఓ వేంకటాచలపతీ ! తవ = నీకు ; సుప్రభాతం = సుప్రభాతము (అగుగాక).

**తా॥ ఈశ్వరుడు, ఇంద్రుడు, అగ్ని, యముడు, నిర్ఋతి, వరుణుడు, వాయువు, కుబేరుడు నగు నెనిమిదిమంది దిక్పాలకులును నీ సేవకై శిరములందు కేల్మోడ్చి వేచియున్నారు. ఓ వేంకటాచలపతీ ! నీకు సుప్రభాత మగుగాక.**

శ్లో॥ ధాటీషు తే విహగరాజ మృగాధిరాజ
నాగాధిరాజ గజరాజ హయాధిరాజాః ।
స్వస్వాధికారమహిమాదిక మర్థయంతే
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥ ౧౭

టీక :— తే = నీ యొక్క ; ధాటీషు = గమనములందు (వాహ్యాళులందు) ; విహగరాజ, మృగాధిరాజ, నాగాధిరాజ, గజ రాజ, హయాధిరాజాః = ( శ్రీ వైనతేయుడు మొదలగువారు ), గరుడుడు, సింహము, ఆదిశేషుడు, ఐరావతము, ఉచ్చైఃశ్రవము అనునవి ; స్వస్వాధికార మహిమాదికం = వారి వారి యధికారము, మహిమ మొదలగువానిని ; అర్థయంతే = ప్రార్థించుచున్నారు. శ్రీ వేంకటాచలపతే ! = ఓ వేంకటాచలపతీ ! తవ = నీకు ; సుప్ర భాతం = సుప్రభాతము (అగుగాక).

తా॥ ఓ వేంకటాచలపతీ ! నీ వాహ్యాళులందు గరుడుడు, సింహము, ఆదిశేషుడు, గజేంద్రుడు, తురగేంద్రుడును, వారివారి యధికార మహి మాదికమును యాచించుచున్నారు. ఓ స్వామీ ! నీకు సుప్రభాత మగుగాక.

శ్లో॥ సూర్యేందుభౌమబుధవాక్పతికావ్యసౌరి
స్వర్భానుకేతుదివిషత్పరిషత్ప్రధానాః ।
త్వద్దాసదాసచరమావధిదాసదాసాః
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥ ౧౮

టీక :— సూర్యేందు, భౌమ, బుధ, వాక్పతి, కావ్య, సౌరి, స్వర్భాను, కేతు, దివిషత్పరిషత్ప్రధానాః = సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని, రాహువు, కేతువు, అను దేవసభలోని ప్రధానులు (నవగ్రహములు) ; త్వద్దాస, దాస, చరమావధి, దాసదాసాః = తమ దాసులకు, దాసులలో కడపటి మేరనున్న దాసులకు దాసులై (యున్నారు). శ్రీ వేంకటాచలపతే = ఓ వేంకటాచలపతీ ! తవ = నీకు ; సుప్రబాతం = సుప్రభాతము (అగుగాక).

తా॥ ఓ స్వామీ! సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు, శని, రాహువు, కేతువు అను దేవసభా ప్రధానులగు నవగ్రహములును, మీ దాస దాసచరమావధి దాసానుదాసులై యున్నారు. ఓ వేంకటాచలపతీ! నీకు సుప్రభాత మగుగాక.

శ్లో॥ త్వత్పాదధూళిభరితస్ఫురితోత్తమాంగాః
స్వర్గాపవర్గనిరపేక్షనిజాంతరంగాః ॥
కల్పాగమాఽఽకలనయాఽఽకులతాం లభంతే
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥ ౧౯

టీక:— త్వత్పాద, ధూళి, భరిత, స్ఫురితోత్తమాంగాః = మీ పాదరేణువులతో నిండి ప్రకాశించు శిరములు గలవారు, (అనగా మీ పాదసేవకులు); స్వర్గాపవర్గ నిరపేక్ష నిజాంతరంగాః = స్వర్గము, మోక్షము, వీనియందు అపేక్షలేని మనసుగలవారై; కల్పాగమాకలనయా = మఱొక కల్పము వచ్చునను భావనచేత; ఆకులతాం = వ్యాకులతను; లభంతే = పొందుచున్నారు. శ్రీ వేంకటాచలపతే = ఓ వేంకటేశ్వరస్వామీ! తవ = నీకు; సుప్రభాతం = సుప్రభాతము (అగుగాక).

తా॥ ఓ వేంకటాచలపతీ! నీ పాదధూళిని శిరమున ధరింపగల్గిన వారు స్వర్గమోక్షములనుకూడ నొల్లక మఱొక కల్పము వచ్చునను నూహచే వ్యాకులపడుచుందురు. ఈ శ్వేతవరాహకల్పము తర్వాత నీ కొండయందీ దేవునకింత మహిమ యుండదనియు, ఈ కల్పమునందే మిక్కిలి గొప్ప మహిమ కలదనియు పురాణములందు ప్రసిద్ధము. (ఒక కల్పము కొన్ని లక్షల సంవత్సరముల కాలము). ఓ వేంకటాచలపతీ! నీకు సుప్రభాత మగుగాక.

శ్లో॥ త్వద్గోపురాగ్రశిఖరాణి నిరీక్షమాణాః
స్వర్గాపవర్గపదవీం పరమాం శ్రయంతః ।
మర్త్యా మనుష్యభువనే మతిమాశ్రయంతే
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥ ౨౦

టీక :— మర్త్యాః = మనుజులు ; పరమాం = ఉత్కృష్టమైన ; స్వర్గాపవర్గపదవీం = స్వర్గలోక మార్గమును, మోక్ష మార్గమును ; శ్రయంతః = పొందుచున్నవారగుచు ; త్వద్గోపురాగ్రశిఖరాణి = మీ దేవాలయ గోపురాగ్రశిఖరములను ; నిరీక్షమాణాః — చూచుచున్నవారై ; మనుష్యభువనే = మనుష్యలోకమునందు (నివసింప) ; మతిం = బుద్ధిని ; ఆశ్రయంతే = పొందుచున్నారు. శ్రీ వేంకటాచలపతే = ఓ వేంకటాచలపతీ ! తవ = నీకు ; సుప్రభాతం = సుప్రభాతము (అగుగాక).

తా॥ స్వర్గమోక్షములకు పోవువారుకూడ త్రోవలో మీ దేవాలయ గోపుర శిఖరములను జూచి యానందపారవశ్యమున స్వర్గమోక్షముల నొల్లక, ఈ మానవలోకముననే మిమ్ముల సేవించు భాగ్యము కలుగ గలదని ఇందే పుట్ట గోరుచుందురు. ఓ వేంకటాచలపతీ ! నీకు సుప్రభాతమగుగాక.

శ్లో॥ శ్రీభూమినాయక దయాదిగుణామృతాబ్ధే
దేవాధిదేవ జగదేక శరణ్యమూర్తే ।
శ్రీమన్ననంతగరుడాదిభి రర్చితాంఘ్రే
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥ ౨౧

టీక :— శ్రీ భూమినాయక = శ్రీ దేవికిని, భూదేవికిని నాయకుడవైనవాడా ! దయాదిగుణామృతాబ్ధే = దయ మొదలైన సుగుణములకు సుధాసాగరమువంటివాడా ! దేవాధిదేవ = దేవతల కెల్ల ప్రధాన దేవుడా ! శ్రీమన్ = సంపద్యుక్తుడైనవాడా ; అనంత గరుడాధిభిః = అనంతుడు (ఆదిశేషుడు), గరుడుడు, విష్వక్సేనుడు మొదలగు వారిచేత ; అర్చితాంఘ్రే = పూజింపబడిన పాదములు గలవాడా ! శ్రీ వేంకటాచలపతే = ఓ వేంకటాచలపతీ ! తవ = నీకు ; సుప్రభాతం = సుప్రభాతము (అగుగాక).

తా॥ ఓ దేవదేవా ! వేంకటాచలపతీ ! శ్రీభూదేవులకు నాయకుడవు. దయాది సుగుణములకు పాలసముద్రమువంటివాడవు. ఈ లోకమున కంతటికిని నీ వొక్కడవే శరణ్యుడవు. అనంతగరుడాదులచే బూజింపబడు పాదములు గలవాడవు. శ్రీమంతుడవు. ఓ స్వామీ ! నీకు సుప్రభాత మగుగాక.

శ్లో॥ శ్రీ పద్మనాభ పురుషోత్తమ వాసుదేవ
వైకుంఠ మాధవ జనార్దన చక్రపాణే ।
శ్రీవత్సచిహ్న శరణాగతపారిజాత
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥ ౨౨

టీక :— శ్రీ పద్మనాభ, పురుషోత్తమ, వాసుదేవ, వైకుంఠ, మాధవ, జనార్దన, చక్రపాణే = ఓ పద్మనాభ, పురుషోత్తమ, వాసుదేవ, వైకుంఠ, మాధవ, జనార్దన, చక్రపాణీ ; శ్రీవత్సచిహ్న = శ్రీవత్సమను పుట్టుమచ్చ గలవాడా ; శరణాగతపారిజాత = శరణు జొచ్చినవారికి పారిజాతమను కల్పవృక్షమువంటివాడా ! శ్రీ వేంకటాచలపతే = ఓ వేంకటాచలపతీ ! తవ = నీకు ; సుప్రభాతం = సుప్రభాతము (అగుగాక).

తా॥ ఓ పద్మనాభా! పురుషోత్తమా! వాసుదేవా! వైకుంఠా! మాధవా! ఓ జనార్దనా! చక్రపాణీ! శ్రీవత్సచిహ్నా! శరణార్థులకు పారిజాతమువంటివాడా! శ్రీ వేంకటాచలపతీ! నీకు సుప్రభాత మగుగాక.

శ్లో॥ కందర్పదర్పహరసుందరదివ్యమూర్తే
కాంతాకుచాంబురుహకుట్మలలోలదృష్టే।
కల్యాణనిర్మలగుణాకర దివ్యకీర్తే
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥ ౨౩

టీక :— కందర్ప, దర్ప, హర, సుందర, దివ్యమూర్తే = మన్మథుని దర్పమును హరించు సుందరమైన దివ్యాకృతిగలవాడా! అనగా (మన్మథునికంటె సుందరమగు నాకారము గలవాడా అని భావము), కాంతాకుచాంబురుహ కుట్మలలోలదృష్టే = ప్రియురాలి తామరమొగ్గలవంటి కుచములయందు ఆసక్తమైన దృష్టిగలవాడా! కల్యాణ నిర్మల గుణాకర దివ్యకీర్తే = శుభకరమైన నిర్మల గుణములకు స్థానమగు దివ్యకీర్తిగలవాడా! శ్రీ వేంకటాచలపతే = ఓ వేంకటాచలపతీ! తవ = నీకు; సుప్రభాతం = సుప్రభాతము (అగుగాక).

తా॥ మన్మథుని దర్ప మడంపజాలు సుందరమూర్తీ! తామరమొగ్గల వంటి ప్రియురాలి స్తనములందు ప్రసరించు చూపులు గలవాడా! అనంత కల్యాణ నిర్మలగుణములకు తానకమైనవాడా! దివ్యకీర్తి గలవాడా! ఓ వేంకటాచలపతీ! నీకు సుప్రభాత మగుగాక.

శ్లో॥ మీనాకృతే కమఠ కోల నృసింహ వర్ణి౯
స్వామి౯ పరశ్వథతపోధన రామచంద్ర ।
శేషాంశరామ యదునందన కల్కిరూప
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥ ౨౪

టీక :— మీనాకృతే = మత్స్యాకారము ధరించిన యో స్వామీ ! కమఠ = కూర్మమూర్తీ ! కోల = వరాహమూర్తీ ! నృసింహ = నారసింహమూర్తీ ! వర్ణి౯ = బ్రహ్మచారిరూపమున నున్న త్రివిక్రమ స్వరూపా ! స్వామి౯ = ఓ స్వామీ ! పరశ్వథ తపోధన=పరశువుగల తాపసీ ! అనగా పరశురామా ! రామచంద్ర= శ్రీరామా ! శేషాంశరామ = ఆదిశేషావతారమగు నో బలరామా ! యదునందన = శ్రీకృష్ణా ! కల్కిరూప = ఓ కల్క్యవతారా ! శ్రీ వేంకటాచలపతే = (దశావతార స్వరూపుడవగు) ఓ వేంకటాచల పతీ ! తవ = నీకు ; సుప్రభాతం = సుప్రభాతము (అగుగాక).

తా॥ ఓ స్వామీ ! నీవు మత్స్యము (చేప), కూర్మము (తాబేలు), వరాహము (పంది), నరసింహము, వామనుడు, పరశురాముడు, శ్రీరాముడు, బలరాముడు, శ్రీకృష్ణుడు, కల్కి యను పది యవతారముల లోకోద్ధరణమునకై దాల్చినవాడవు. శ్రీ వేంకటాచలపతీ ! నీకు సుప్రభాత మగుగాక.

శ్లో॥ ఏలాలవంగఘనసారసుగంధితీర్థం
దివ్యం వియత్సరితి హేమఘటేషు పూర్ణమ్ ।
ధృత్వాఽద్య వైదికశిఖామణయః ప్రహృష్టాః
తిష్ఠంతి వేంకటపతే తవ సుప్రభాతమ్ ॥ ౨౫

టీక :— వైదికశిఖామణయః = వేదవిదులైన బ్రాహ్మణోత్తములు ; ఏలా, లవంగ, ఘనసార, సుగంధి = ఏలకులు, లవంగములు, పచ్చకర్పూరము, వీనిచేత పరిమళభరితమైన ; దివ్యం = మనోజ్ఞమైన ; తీర్థం = జలమును ; వియత్సరితి = ఆకాశగంగనుండి ; హేమఘటేషు = బంగారుకడవలలో ; పూర్ణం = నిండుగా ; ధృత్వా = ధరించి ; ప్రహృష్టాః = మిక్కిలి హర్షించుచున్నవారై ; అద్య = ఇప్పుడు ; తిష్ఠంతి = వేచియున్నారు, వేంకటపతే = ఓ వేంకటాచలపతీ ! తవ = నీకు ; సుప్రభాతం = సుప్రభాతము (అగుగాక).

తా॥ వైదికోత్తములు ఏలకులు, లవంగములు, పచ్చకర్పూరము, వీనిచే సువాసితమైన దివ్యమైన యాకాశగంగనీటిని బంగారుకడవలనిండుగ మోచి మీ యారాధనకై సంతోషముతో వేచియున్నారు. ఓ వేంకటాచలపతీ! నీకు సుప్రభాత మగుగాక.

శ్లో॥ భాస్వానుదేతి వికచాని సరోరుహాణి
సంపూరయంతి నినదైః కకుభో విహంగాః ।
శ్రీవైష్ణవాస్సతతమర్థితమంగళాస్తే
ధామాశ్రయంతి తవ వేంకట సుప్రభాతమ్ ॥ ౨౬

టీక :— భాస్వాన్ = సూర్యభగవానుడు ; ఉదేతి = ఉదయించుచున్నాడు ; సరోరుహాణి = కమలములు ; వికచాని = వికసించినవి ; విహంగాః = పక్షులు ; నినదైః = శబ్దములచే ; కకుభః = దిక్కులను ; సంపూరయంతి = నింపుచున్నవి ; శ్రీ వైష్ణవాః = శ్రీ వైష్ణవులు ; సతతం = ఎల్లపుడును ; అర్థితమంగళాః = ప్రార్థించుచున్న శుభములు గలవారై ; తే = నీ యొక్క ; ధామ = దివ్యసన్నిధిని ;

ఆశ్రయంతి = ఆశ్రయించుచున్నారు, వేంకట = ఓ వేంకటేశ్వర స్వామి ; తవ = నీకు ; సుప్రభాతం = సుప్రభాతము (అగుగాక).

తా॥ ఓ వేంకటాచలపతీ ! సూర్యుడుదయించుచున్నాడు. తామరలు వికసించుచున్నవి. పక్షులు కలకల శబ్దములచే నల్దిక్కులు నింపుచున్నవి. శ్రీ వైష్ణవులు మంగళముల గోరుచు సన్నిధిలో వేచియున్నారు. స్వామీ ! నీకు సుప్రభాత మగుగాక !

శ్లో॥ బ్రహ్మాదయస్సురవరా స్సమహర్షయ స్తే
సంతస్సనందనముఖా స్త్వథ యోగివర్యాః ।
ధామాంతికే తవ హి మంగళవస్తుహస్తాః
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥ ౨౨

టీక :— తే = ప్రసిద్ధులైన ; బ్రహ్మాదయః = బ్రహ్మ మొదలైన ; సురవరాః = దేవోత్తములు ; సమహర్షయః = మహర్షులతో గూడినవారును ; అథ = మఱియు ; సంతః = సత్పురుషులగు ; సనందనముఖాః = సనందనప్రముఖులగు ; యోగివర్యాః = యోగివర్యులును ; తవ = నీ యొక్క ; ధామాంతికే = ఆలయ సమీపమున ; మంగళవస్తుహస్తాః = పూజార్థములగు శోభనవస్తువులు హస్తములందు గలవారై (యున్నారు). శ్రీ వేంకటాచలపతే = ఓ వేంకటాచలపతీ ; తవ = నీకు ; సుప్రభాతం = సుప్రభాతము (అగుగాక).

తా॥ ఓ వేంకటేశా ! బ్రహ్మ మొదలగు దేవతలందరును, ఋషీశ్వరులును, సనందనుడు మొదలగు యోగీశ్వరులును, మంగళమగు వస్తువులను కేలబూని నీ సన్నిధిచేరువ వేచియున్నారు. స్వామీ ! నీకు సుప్రభాత మగుగాక.

శ్లో॥ లక్ష్మీనివాస నిరవద్యగుణైకసింధో
సంసారసాగర సముత్తరణైకసేతో ।
వేదాంతవేద్య నిజవైభవ భక్తభోగ్య
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్ ॥ ౨౮

టీక :— లక్ష్మీనివాస = లక్ష్మీదేవికి నివాసస్థాన భూతుడా! నిరవద్యగుణైకసింధో = దోషరహితములగు కల్యాణ గుణములకు సముద్రమువంటి వాడా! సంసారసాగర సముత్తరణైకసేతో = సంసారమను సముద్రమును దాటుటకు ముఖ్యమైన వంతెనవంటి వాడా! వేదాంతవేద్య నిజవైభవ = వేదాంతముచే అనగా ఉపనిషదాదులచే దెలిసికొనదగిన నిజవైభవము గలవాడా! భక్తభోగ్య = భక్తులచే అనుభవింపబడువాడా! శ్రీ వేంకటాచలపతే = ఓ శ్రీనివాసా! తవ = నీకు; సుప్రభాతం = సుప్రభాతము (అగుగాక).

తా॥ ఓ శ్రీనివాసా! కల్యాణగుణసాగరా! నీవు ఈ సంసారసముద్రమును దాటుటకు వంతెనవంటివాడవు. ఉపనిషత్తులచే తెలిసికొనదగిన వైభవముగలవాడవు. ఓ భక్తభోగ్యా! వేంకటాచలపతీ! నీకు సుప్రభాతమగుగాక.

శ్లో॥ ఇత్థం వృషాచలపతే రిహ సుప్రభాతం
యే మానవాః ప్రతిదినం పఠితుం ప్రవృత్తాః ।
తేషాం ప్రభాతసమయే స్మృతిరంగభాజాం
ప్రజ్ఞాం పరార్థసులభాం పరమాం ప్రసూతే ॥ ౨౯

టీక :— ఇత్థం=ఈ విధముగా ; వృషాచలపతేః=వేంకటా చలపతికి ; ఇహ = ఈ ప్రాతఃకాలమున, లేక యీ లోకమున ; సుప్రభాతం=సుప్రభాత స్తవమును ; యే మానవాః=యే మనుజులు ; ప్రతిదినం = ప్రతిదినమును ; పఠితుం = చదువుటకు ; ప్రవృత్తాః = ప్రవృత్తులగుచున్నారో ; తేషాం = ఆ పాఠకులగు ; అంగభాజాం = దేహాలకు, అనగా భక్తులకు ; స్మృతిః = ఈ వేంకటేశస్మరణము ; పరార్థసులభాం = పరమార్థప్రదమగు ; పరమాం = శ్రేష్ఠమగు ; ప్రజ్ఞాం=ప్రజ్ఞను ; ప్రభాతసమయే=ప్రాతఃకాలమున ; ప్రసూతే = కలుగజేయుచున్నది.

తా॥ ప్రొద్దుటివేళ ఈ సుప్రభాత స్తోత్రమును ఏ మానవులు ప్రతి దినమును భక్తితో చదువుదురో వారి స్మృతి సులభముగా మోక్షము నందించు పరమప్రజ్ఞను కలుగజేయును.



# శ్రీ వేంకటేశస్తోత్రమ్



శ్లో॥ కమలాకుచచూచుక కుంకుమతో
నియతారుణితాతుల నీలతనో ।
కమలాయతలోచన లోకపతే
విజయీ భవ వేంకటశైలపతే ॥ ౧

టీక:— కమలాకుచచూచుక కుంకుమతః = శ్రీదేవియొక్క చనుమొనల యందలి కుంకుమ పూవురంగు వలన; నియతారుణితాతుల నీలతనో: = నియమముగా నెఱ్ఱగా జేయబడిన సాటిలేని నల్లనిశరీరము గలవాడా, (ఓ కృష్ణా!); కమలాయత లోచన = తామరరేకులవలె నిడుపైన కన్నులు గలవాడా! లోకపతే = జగన్నాయకా! వేంకటశైలపతే = ఓ వేంకటాచలపతీ! విజయీ భవ = జయశీలుడవు కమ్ము!

తా॥ ఓ వేంకటాచలపతీ! శ్రీదేవి చను మొనల కుంకుమపూతవలన నెఱ్ఱనైన నీలశరీరము గలవాడవు. తామరపూరేకులవలె నిడుపైన కన్నులు గలవాడవు. ఓ జగన్నాయకా! స్వామీ! నీకు జయము జయము.

శ్లో॥ సచతుర్ముఖ షణ్ముఖ పంచముఖ
ప్రముఖాఖిలదైవతమౌళిమణే ।
శరణాగతవత్సల సారనిధే
పరిపాలయ మాం వృషశైలపతే ॥ ౨

టీక:—సచతుర్ముఖ షణ్ముఖ పంచముఖ ప్రముఖాఖిలదైవత మౌళిమణే = బ్రహ్మతో గూడిన కుమారస్వామి, మహేశ్వరుడు, మొదలైన సమస్తదేవతలకు తలమానికమైనవాడా! శరణాగత వత్సల = శరణుజొచ్చిన వారియందు వాత్సల్యము గలవాడా! సార నిధే=బలమునకు నిధానమైనవాడా! హే వృషశైలపతే = ఓ వృషభాచలనాథా, ఓ వేంకటాచలపతీ! మాం = నన్ను; పరిపాలయ = కాపాడుము; రక్షింపుము.

తా॥ బ్రహ్మ, శివుడు, కుమారస్వామి మొదలగు సమస్తదేవతలకు తలమానికమువంటివాడవు. శరణుజొచ్చినవారిని ప్రీతితో బ్రోచువాడవు. సారనిధివి. ఓ వేంకటాచలపతీ! నన్ను రక్షింపుము.

శ్లో॥ అతివేలతయా తవ దుర్విషహై
రనువేలకృతై రపరాధశతైః ।
భరితం త్వరితం వృషశైలపతే
పరయా కృపయా పరిపాహి హరే ॥ 3

టీక:— అతివేలతయా = హద్దును మించునట్లుగా; తవ = నీకు; దుర్విషహైః = సహింపరానటువంటి; అనువేలకృతైః = ఎల్లప్పుడు నాచరింపబడిన; అపరాధశతైః = పెక్కునేరములచేత; భరితం = పూర్ణుడనైనటువంటినన్ను; త్వరితం = త్వరతో గూడినటువంటినన్ను; (మాం = నన్ను); వృషశైలపతే = ఓ వేంకటేశా; హరే = ఓ శ్రీహరీ! పరయా = ఉత్కృష్టమైన; కృపయా = దయచేత; పరిపాహి = సంరక్షింపుము.

తా॥ ఓ శ్రీహరీ! హద్దుమీరి సైపరాని యపరాధముల పెక్కింటిని పలుమారు గావించితిని. ఓ వేంకటాచలపతీ! మిక్కిలి దయతో నీ దుష్టుని త్వరగా గాపాడుము.

శ్లో॥ అధివేంకటశైల ముదారమతేః
ర్జనతాభిమతాధికదానరతాత్ ।
పరదేవతయా గదితాన్నిగమైః
కమలాదయితాన్న పరం కలయే ॥ ౪

టీక:— అధివేంకటశైలం = వేంకటాచలమందు; ఉదార మతేః = ఉదారమైన, దానపరమైన బుద్ధి గలిగినటువంటిన్ని; జన తాభిమతాధిక దానరతాత్ = జన సమూహము యొక్క కోరికలను అధికముగా నిచ్చుటయం దాసక్తుడైనటువంటిన్ని; నిగమైః = వేద ములచేత; పరదేవతయా = శ్రేష్ఠదైవముగా; గదితాత్ = పేర్కొన బడినటువంటిన్ని; కమలావయితాత్ = శ్రీపతియైన వేంకటేశుని కంటె; పరం = ఇతరమును; న కలయే = కొలుచుటలేను. ఎఱుగను.

తా॥ ఓ స్వామీ! జనులు కోరినదానికన్న ఎక్కువ వరములిచ్చు ఉదారమతివి. నిన్ను వేదములు పరమదైవముగా కొనియాడుచున్నవి. వేంకటాచలపతి యగు ఓ లక్ష్మీపతీ! నీకంటె నన్య నే నొల్లను.

శ్లో॥ కలవేణురవావశగోపవధూ
శతకోటివృతాత్స్మరకోటిసమాత్ ।
ప్రతివల్లవికాభిమతాత్సుఖదాత్
వసుదేవసుతాన్న పరం కలయే ॥ ౫

టీక :— కలవేణురవావశ గోపవధూ శతకోటివృతాత్ = మనోహరమైన వేణునాదముచే పరవశలగు గోపికాసహస్రములచే జుట్టుకొనబడినటువంటిన్ని ; స్మరకోటి సమాత్ = కోటిమన్మథులతో సమానుడైనటువంటిన్ని ; సుఖదాత్ = సుఖము నొసంగు నటువంటిన్ని ; ప్రతివల్లవికాభిమతాత్ = ఒక్కొక్క గోపికాస్త్రీకిని ప్రియుడైనటువంటిన్ని ; వసుదేవ సుతాత్ = వసుదేవ పుత్రుడైన శ్రీకృష్ణునికంటె ; పరం = అన్యమును ; న కలయే = ఎఱుగను.

తా॥ ఓ గోపాలస్వామీ ! మనోహరమగు నీ వేణుగానముచే పరవశలై గోపికలు వేనవేలు నిన్ను చుట్టుముట్టియుందురు. కోటి మన్మథ లావణ్యము గల్గి గోపికల కొక్కొక్కరికిని ప్రియముగ మెలిగి సుఖము నొసంగుచుందువు. ఓ వాసుదేవా ! నీకంటె నన్యము నే నెఱుంగను.

శ్లో॥ అభిరామగుణాకర దాశరథే
జగదేకధనుర్ధర ధీరమతే ।
రఘునాయక రామ రమేశ విభో
వరదో భవ దేవ దయాజలధే ॥ ౬

టీక :— అభిరామగుణాకర = మనోహరమైన సుగుణములకు స్థానమైనవాడా ! దాశరథే = ఓ శ్రీరామా ! జగదేకధనుర్ధర = లోకమున కంతటికిని ముఖ్యుడవైన ధనుర్ధరుడగు వీరాగ్రేసరా ! ధీరమతే = ధైర్యము గలవాడా ! రఘునాయక = రఘువంశ శ్రేష్ఠుడా ! రామ = ఓ శ్రీరామా ! రమేశా = విష్ణుమూర్తీ ! విభో = సర్వవ్యాపీ ! దయాజలనిధే = కరుణకు సముద్రమువంటివాడా ! దేవ = ఓ స్వామీ ! వరదో భవ = వరముల నిచ్చువాడవు కమ్ము.

తా॥ ఓ వేంకటేశ్వరా! కల్యాణగుణములకు తావైన ఓ దాశరథీ! నీవు జగదేకధనుర్ధారివి. రఘునాయకా! రామా! లక్ష్మీపతీ! దయా సముద్రా! ఓ స్వామీ! దేవదేవ! వరములనొసగి మమ్ము కాపాడుము.

శ్లో॥ అవనీతనయాకమనీయకరం
రజనీకరచారుముఖాంబురుహమ్ ।
రజనీచరరాజతమోమిహిరం
మహనీయమహం రఘురామమయే ॥ ౭

టీక:— అవనీతనయా కమనీయకరం = సీతాదేవిచేత కోరబడిన హస్తముకలవాడును, లేక సీతకిష్టమైనదానిని చేయువాడును: రజనీకర చారుముఖాంబురుహం = నిశాకరుడైన చంద్రునివలె నందమగు ముఖకమలము గలవాడును; రజనీచర రాజతమోమిహిరం = రాత్రించరులగు రాక్షసులకు రాజగు రావణుడను అంధకారమునకు సూర్యునివంటివాడును; మహనీయం = మహాత్ముడునగు; రఘురామం = రాఘవుడగు శ్రీరాముని; అహం = నేను; అయే = పొందుచున్నాను; శరణుపొందుచున్నాను.

తా॥ భూదేవికూతురగు సీతాదేవికి మిక్కిలి నచ్చిన యందగాడవు. చందమామనుగేరు మోముదమ్మి గలవాడవు. రావణాసురుడను దట్టమగు చీకటికి సూర్యునివంటివాడవు. ఓ రఘురామా! మహానుభావుడవు. నిన్నే శరణువేడుచున్నాను.

శ్లో॥ సుముఖం సుహృదం సులభం సుఖదం
స్వనుజం చ సుకాయమమోఘశరమ్ ।
అపహాయ రఘూద్వహమన్యమహం
న కథంచన కంచన జాతు భజే ॥ ౮

టీక :— సుముఖం = చక్కని మోము గలవాడును ; సుహృదం = మంచి మనస్సు గలవాడును ; సులభం = కష్టము లేకయే పొంద శక్యమగువాడును ; స్వనుజం = మంచి సోదరులు గలవాడును; సుకాయం = మంచి శరీరము గలవాడును ; అమోఘ శరం = వ్యర్థముకాని బాణములు గలవాడునగు ; రఘూద్వహం = రఘుకులోద్ధారకుడగు శ్రీరాముని ; అపహాయ=విడచి ; అన్యం= ఇతరుని ; కంచన = ఎవ్వనినిగాని ; అహం = నేను ; కథంచన= ఎటులైనను ; జాతు = ఒకప్పుడైనను ; న భజే = సేవింపను.

తా॥ ఓ శ్రీరామా ! నీ ముఖము, శరీరము, దివ్యసుందరములు. నీ మనస్సు మిక్కిలి మృదువైనది. ఎల్లజనులకు సులభముగా ఆశ్రయింప దగినవాడవై సుఖము నొసగుదువు. మంచి తోబుట్టువులు గలవాడవు. మొక్కవోని యమ్ములు గలవాడవు. ఓరఘుపతీ ! నిన్నువిడచి వేఱొకని నెవ్వనిని నెప్పుడును సేవింపను.

శ్లో॥ వినా వేంకటేశం న నాథో న నాథః
సదా వేంకటేశం స్మరామి స్మరామి ।
హరే వేంకటేశ ప్రసీద ప్రసీద
ప్రియం వేంకటేశ ప్రయచ్ఛ ప్రయచ్ఛ ॥ ౬

టీక:— వేంకటేశం వినా = వేంకటేశ్వరుని విడిచి ; నాథః= నాథుడైనవాడు : న = లేడు ; నాథః న = దిక్కైనవాడు లేడు ; సదా = ఎల్లప్పుడును ; వేంకటేశం=వేంకటేశ్వరుని ; స్మరామి = తలంచుచున్నాను; స్మరామి = ధ్యానించుచున్నాను. హరే ! వేంకటేశ = ఓ శ్రీహరీ ! వేంకటేశా ! ప్రసీద = అనుగ్రహింపుము.

ప్రసీద = ప్రసన్నుడవుకమ్ము, (అనుగ్రహింపుము). వేంకటేశ = ఓ వేంకటేశ! ప్రియం = ఇష్టమును, అనగా, కోరినదానిని; ప్రయచ్ఛ = ఇమ్ము; ప్రయచ్ఛ = ఇమ్ము.

తా॥ వేంకటేశ్వరుడుకాక నాకు వేరుదిక్కు ఎవ్వరును లేరు. ఎల్లివేళల వేంకటేశ్వరుని నే స్మరింతును. శ్రీహరీ! వేంకటేశ్వరా! ప్రసన్నుడ వగుము, ప్రీతినిమ్ము.

శ్లో॥ అహం దూరత స్తే పదాంభోజయుగ్మ
ప్రణామేచ్ఛయాఽఽగత్య సేవాం కరోమి।
సకృత్సేవయా నిత్యసేవాఫలం త్వం
ప్రయచ్ఛ ప్రయచ్ఛ ప్రభో వేంకటేశ॥ ౧౦

టీక :- ప్రభో = ప్రభువైన; వేంకటేశ = ఓ వేంకటేశ్వరస్వామీ: అహం = నేను; తే = నీయొక్క; పదాంభోజయుగ్మ ప్రణామేచ్ఛయా = పాదారవిందములకు ప్రణమిల్లు కోర్కెచేత; దూరతః = దూరమునుండి; ఆగత్య = వచ్చి; సేవాం = నీసేవను; కరోమి = చేయుచున్నాను. సకృత్సేవయా = సకృత్తుగా చేయు నీ సేవచేతనే; నిత్యసేవాఫలం = ప్రతిదినమును సేవచేయు ఫలమును; త్వం = నీవు; ప్రయచ్ఛ = ఇమ్ము; ప్రయచ్ఛ = ఇమ్ము.

తా॥ ఓ వేంకటేశప్రభూ! నీ పాదకమలసేవకై భక్తితో నెంతో దూరమునుండి వచ్చి కొలుచుచున్నాను. ఓ స్వామీ! ఒకమారు చేయు నీ సేవచేతనే నిన్ను నిత్యము గొలుచు సేవాఫలము నాకు దయచేసి యిమ్ము.

శ్లో॥ అజ్ఞానినా మయా దోషా
నశేషాన్విహితాన్ హరే ।
క్షమస్వ త్వం క్షమస్వ త్వం
శేషశైలశిఖామణే ॥ ౧౧

టీక :— శేషశైలశిఖామణే = శేషాచలమునకు తలమానిక మైన ఓ వేంకటేశ్వరస్వామీ ! హరే = శ్రీకృష్ణా ! అజ్ఞానినా = జ్ఞానము లేని మూఢుడనగు ; మయా = నాచేత ; విహితాన్ = ఆచరింపబడినటువంటి ; అశేషాన్ = సమస్తమైన ; దోషాన్ = అపరాధములను ; త్వం=నీవు ; క్షమస్వ = క్షమింపుము. త్వం = నీవు ; క్షమస్వ = క్షమింపుము.

తా॥ ఓ శేషశైలశిఖామణీ ! మూఢుడనై యనేకములగు నేరముల గావించితిని. ఓ శ్రీహరీ ! వానినన్నిటిని క్షమింపుము స్వామీ! క్షమింపుము.

# శ్రీ వేంకటేశప్రపత్తి

శ్లో॥ ఈశానాంజగతోఽస్యవేంకటపతేర్విష్ణోఃపరాంప్రేయసీం
తద్వక్షఃస్థలనిత్యవాసరసికాం తత్‌క్షాంతిసంవర్ధినీమ్ ।
పద్మాలంకృతపాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాదిగుణోజ్జ్వలాంభగవతీంవందేజగన్మాతరమ్॥

టీక :— అస్య జగతః = ఈ ప్రపంచమునకు ; ఈశానాం = (రాణియైన), యజమానురాలై నటువంటిన్ని ; వేంకటపతేః = వేంకటాచలపతియైన; విష్ణోః=విష్ణుమూర్తికి; పరాం=ఉత్కృష్టురాలైన ; ప్రేయసీం = ప్రియురాలై నటువంటిన్ని : తద్వక్షఃస్థల నిత్య వాసరసికాం = ఆ విష్ణుమూర్తియొక్క వక్షఃస్థలమందు సదా వాసము చేయుటయం దాసక్తురాలై నటువంటిన్ని ; తత్‌క్షాంతిసంవర్ధినీం = ఆ విష్ణుమూర్తియొక్క క్షమాగుణమును, (ఓర్పును) వృద్ధిజేయునటువంటిన్ని ; పద్మాలంకృత పాణిపల్లవయుగాం = తామరపూవులచే నలంకరింపబడిన చిగురువంటి హస్తములజంటను గలిగినటువంటిన్ని ; పద్మాసనస్థాం = కమల మనెడు ఆసనమునందు, లేక పద్మాసనమను నాసనవిశేషమున నున్నటువంటిన్ని ; వాత్సల్యాది గుణోజ్జ్వలాం = వాత్సల్యము, అనగా ప్రీతి మొదలగు సుగుణములచేత ప్రకాశించునటువంటిన్ని; జగన్మాతరం=ఈప్రపంచమునకంతటికిని తల్లియైనటువంటిన్ని ; భగవతీం = పూజ్యురాలగు ; శ్రియం = లక్ష్మీదేవిని ; వందే = నమస్కరించుచున్నాను, లేక స్తుతించుచున్నాను.



శ్రీ పద్మావతీదేవి, తిరుచానూరు.

తా॥ ఈ లోకమున కంతటికిని యజమానురాలును, సాక్షాద్విష్ణు మూర్తియైన వేంకటాచలపతికి మిక్కిలి ప్రియురాలును, ఆతని యోర్పు గుణమును పెంపొంద జేయునదియు, తామరపూవుల నలంకారముగా తన చిగురుకేల దాల్చునదియు, పద్మాసనమున గూర్చుండి యుండునదియు, వాత్సల్యము మొదలగు మేలిగుణములచే నిత్యము ప్రకాశించునదియు, నెల్లలోకములకు దల్లియు, భగవతియు నగు లక్ష్మీదేవికి నమస్కరించు చున్నాను.

శ్లో॥ శ్రీమన్ కృపాజలనిధే ! కృతసర్వలోక !
సర్వజ్ఞ ! శక్త ! నతవత్సల ! సర్వశేషిన్ !
స్వామిన్ ! సుశీలసులభాశ్రితపారిజాత !
శ్రీ వేంకటేశ ! చరణౌ శరణం ప్రపద్యే ॥ ౨

టీక:— శ్రీమన్ = సంపద్యుక్తుడా ; కృపాజలనిధే = దయా సముద్రుడా ! కృతసర్వలోక = చేయబడిన సమస్తప్రపంచము గల వాడా ! సర్వజ్ఞ = సమస్తము తెలిసినవాడా ! శక్త = సమర్థుడా ! నత వత్సల = నమస్కరించిన వారియందు ప్రీతిగలవాడా ! సర్వశేషిన్ = చేతనాచేతనాత్మకమగు నీ సర్వప్రపంచమునకు అంగియైనవాడా, లేక ప్రధానమైనవాడా ! స్వామిన్ = ఓ స్వామీ ! సుశీల సులభ = మంచి శీలముగలవారికి సుఖముగా పొంద శక్యమైనవాడా, లేక, సుశీల = మంచి శీలముగలవాడా! సులభ = సుఖముగా పొంద శక్యమగువాడా ! ఆశ్రితపారిజాత = ఆశ్రయించిన వారికి పారిజాతము వంటివాడా ! (అనగా కోరిన కోర్కెలనెల్ల ఫలింపజేయువాడా అని భావము). శ్రీ వేంకటేశ = ఓ వేంకటేశ్వరస్వామీ ! చరణౌ = మీ పాదముల జంటను ; శరణం = శరణముగా ; ప్రపద్యే = పొందుచున్నాను.

తా॥ ఓ వేంకటేశ్వరస్వామీ! నీవు శ్రీమంతుడవు, దయాసముద్రుడవు. ఎల్లలోకములకు కర్తవు. సర్వము దెలిసినవాడవు. సమర్థుడవు. నమస్కరించు వారియెడ వాత్సల్యము జూపువాడవు. ఈ చేతనాచేతనరూపమగు ప్రపంచమున నీవే ప్రధానుడవు. మంచి స్వభావము గలవారికి సులభుడవు. ఆశ్రితులకు పారిజాతమువంటివాడవు. ఓ దేవా! నీ పాదములే శరణమని ఆశ్రయించుచున్నాము.

శ్లో॥ ఆనూపురార్పితసుజాతసుగంధిపుష్ప
సౌరభ్యసౌరభకరౌ సమసన్నివేశౌ ।
సౌమ్యౌ సదానుభవనేఽపి నవానుభావ్యౌ
శ్రీ వేంకటేశచరణౌ శరణం ప్రపద్యే ॥ 3

టీక :— ఆనూపురార్పిత సుజాత సుగంధిపుష్ప సౌరభ్య సౌరభకరౌ = కాలి యందెలవఱకును సమర్పింపబడిన మంచి పరిమళము గల పుష్పముల సువాసనకు పరిమళమును కలిగించునవియు; సమసన్నివేశౌ=సమానమైన సన్నివేశము గలవియు, (అనగా చక్కగా నమర్పబడియున్నవియు నని భావము). సౌమ్యౌ = ప్రసన్నములైనవియు; సదా = ఎల్లప్పుడును; అనుభవనేఽపి = అనుభవమునను న్నను; నవానుభావ్యౌ=క్రొత్తవిగా ననుభవింపదగినవియు నగు; శ్రీ వేంకటేశచరణౌ= శ్రీవేంకటేశ్వరస్వామి చరణయుగళమును; శరణం = శరణముగా: ప్రపద్యే = పొందుచున్నాను.

తా॥ ఓ స్వామీ! కాలియందెలవఱకును సమర్పింపబడిన మేలైన సువాసనగల పూవుల సుగంధమునకు మఱింత పరిమళము నొసగునవియు, సమముగా నమరినవియు, చూచుటకెంతో యందమైనవియు. ఎల్లప్పుడు ననుభవించుచున్నను క్రొత్తగా ననుభవింప మనసుగొల్పునవియు నగు శ్రీ వేంకటేశ్వరస్వామి పాదముల నే శరణొందుచున్నాను.

శ్లో॥ సద్యోవికాసి సముదిత్వరసాంద్రరాగ
సౌరభ్యనిర్భర సరోరుహ సామ్యవార్తామ్ ।
సమ్యక్షు సాహసపదేషు విలేఖయంతౌ
శ్రీ వేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే ॥ ౪

టీక:— సద్యోవికాసి, సముదిత్వరసాంద్రరాగ సౌరభ్యనిర్భర సరోరుహ సామ్యవార్తాం = అప్పుడే వికసించునవియు, లెస్సగా నుత్పన్నమగుచున్న దట్టమగు నెఱ్ఱందనము, పరిమళము వీనిచే పూర్ణములు నగు తామరపువ్వుల సామ్యవచనమును ; సమ్యక్షు = చక్కనివియగు ; సాహసపదేషు = తొందరగా నుంచబడిన పాద చిహ్నములందు ; విలేఖయంతౌ = వ్రాయించునవియగు, (అనగా కమలముల సామ్యమును స్మరింపజేయు చిహ్నములు గల పాదము లని భావము). లేక, సమ్యక్షు = మంచివగు ; సాహసపదేషు = సాహసస్థానములందు, సాహసకృత్యములందు ; విలేఖయంతౌ = వ్రాయించునవియు నగు, అనగా లోకమున గొప్ప సాహసకృత్యములలో భగవత్పాదములకు కమలసామ్యమును చెప్పుట యను నది యొక సాహసకృత్యమని స్వామిపాదములు ( మాచే ) వ్రాయించు చున్నట్లున్నవని భావము. అనగా కమలములకన్న నెన్నోరెట్లు స్వామిపాదములు గొప్పవని తాత్పర్యము. శ్రీ వేంకటేశచరణౌ = శ్రీ వేంకటేశ్వరస్వామి పాదయుగళమును ; శరణం=శరణమును; ప్రపద్యే = పొందుచున్నాను.

తా॥ అప్పుడే వికసించి ప్రకాశించుచు సాంద్రమైనరక్తిమయు, నింపగు పరిమళమును నిండిన తామరపూవుతోడ తమ్ముఁ బోల్చుట గొప్ప సాహస కార్యములలో జేరినదని మాచే వ్రాయించునట్టి శ్రీ వేంకటేశ్వరస్వామి పాదములనే శరణని వేడుకొనుచున్నాను.

శ్లో॥ రేఖామయధ్వజసుధాకలశాతపత్ర
వజ్రాంకుశాంబురుహకల్పకశంఖచక్రైః ।
భవ్యైరలంకృతతలౌ పరతత్త్వచిహ్నైః
శ్రీ వేంకటేశచరణౌ శరణం ప్రపద్యే ॥ ౫

టీక :— భవ్యైః = క్షేమంకరములగు ; రేఖామయధ్వజ-సుధాకలశాతపత్ర వజ్రాంకుశాంబురుహ కల్పక శంఖచక్రైః=రేఖల రూపముగానున్న ధ్వజము, అమృతకలశము, ఛత్రము, వజ్రము, అంకుశము, కమలము, శంఖము, చక్రము, వీనిచేతను ; పరతత్త్వచిహ్నైః = పరమార్థచిహ్నములచేతను ; అలంకృతతలౌ = అలంకరింపబడిన ప్రదేశములుగల ; శ్రీ వేంకటేశచరణౌ = శ్రీ స్వామివారి పాదయుగళమును ; శరణం ప్రపద్యే = శరణు పొందు చున్నాను.

తా॥ మంగళకరములగు రేఖలవలెనున్న ధ్వజము, అమృతకలశము, గొడుగు, వజ్రము, అంకుశము, పద్మము, కల్పవృక్షము, శంఖము చక్రము మొదలైన పరమార్థసూచకములగు శుభచిహ్నములచేతను అలంకరింపబడిన శ్రీ వేంకటేశ్వరస్వామివారి దివ్యచరణయుగళమును శరణు వేడుచున్నాను.

శ్లో॥ తామ్రోదరద్యుతిపరాజితపద్మరాగౌ
బాహ్యైర్మహోభి రభిభూతమహేంద్రనీలౌ ।
ఉద్యన్నఖాంశుభిరుదస్తశశాంకభాసౌ
శ్రీ వేంకటేశచరణౌ శరణం ప్రపద్యే ॥ ౬

టీక :— తామ్రోదరద్యుతిపరాజిత పద్మరాగౌ = ఎఱ్ఱనైన మధ్యభాగముయొక్క, (అనగా అడుగుభాగమగు నఱకాలియొక్క) కాంతిచే తిరస్కరింపబడిన పద్మరాగము లను రత్నములుగలవియు, లేక పద్మములయొక్క యెఱ్ఱంచనమును గలవియు, బాహ్యైః = వెలుపలివగు ; మహోభిః = తేజస్సులచేత, (కాంతులచేత) ; అభిభూత మహేంద్రనీలౌ = తిరస్కరింపబడిన మహేంద్రనీలములు గలవియు; ఉద్యన్నఖాంశుభిః=పైకెగయుచున్న గోటికాంతులచేత; ఉదస్తశశాంకభాసౌ= తిరస్కరింపబడిన చంద్రకాంతులు గలవియు నగు; శ్రీ వేంకటేశచరణౌ= శ్రీ వేంకటేశ్వర పాదయుగళమును; శరణం ప్రపద్యే = శరణుజొచ్చుచున్నాను.

తా॥ ఎఱ్ఱనైన యఱకాలికాంతిచే తిరస్కరింపబడిన పద్మరాగములు గలవియు, మీగాళ్ళకాంతులచే తిరస్కరింపబడిన యింద్రనీలమణులు గలవియు, పైకెగయు గోటికాంతులచే తిరస్కరింపబడిన చంద్రకాంతులు గలవియు నగు శ్రీ వేంకటేశపాదములను శరణువేడుచున్నాను.

శ్లో॥ సప్రేమభీతి కమలాకరపల్లవాభ్యాం
సంవాహనేఽపి సపది క్లమమాదధానౌ ।
కాంతావవాఙ్మనసగోచరసౌకుమార్యౌ
శ్రీ వేంకటేశచరణౌ శరణం ప్రపద్యే ॥ ౭

టీక:— కమలాకర పల్లవాభ్యాం = లక్ష్మీదేవియొక్క చిగురువంటి చేతులచే ; సప్రేమభీతి=ప్రేమ, భయము అను భావములతో గూడినట్లుగా ; సంవాహనేఽపి = ఒత్తబడుటయందును ; సపది = తత్క్షణమే ; క్లమం = బాధను ; ఆదధానౌ = పొందునవియు ;

కాంతౌ = మనోహరములును ; అవాఙ్మనసగోచర సౌకుమార్యౌ = వాక్కునకును, మనసునకును గోచరింపని సౌకుమార్యము గల వియు నగు ; శ్రీ వేంకటేశచరణౌ = శ్రీ వేంకటేశ్వరస్వామి పాద యుగళమును ; శరణం ప్రపద్యే = శరణొందుచున్నాను.

తా॥ లక్ష్మీదేవి తన చిగురులవంటి చేతులతో ప్రేమ, భయముగల్గి మెత్తగా ఒత్తినను, అప్పుడే కందిపోవునవియు, మాటలచేతను, మనస్సు చేతను ఇంతని చెప్ప నలవికాని సౌకుమార్యము గలవియు, మిక్కిలి యందములైనవియు నగు శ్రీ వేంకటేశ్వరస్వామి పాదములను శరణు వేడుచున్నాను.

శ్లో॥ లక్ష్మీమహీతదనురూప నిజానుభావ
నీళాది దివ్యమహిషీ కరపల్లవానామ్ ।
ఆరుణ్యసంక్రమణతః కిల సాంద్రరాగౌ
శ్రీ వేంకటేశచరణౌ శరణం ప్రపద్యే ॥ ౮

టీక :— లక్ష్మీ, మహీ, తదనురూప నిజానుభావ నీళాది, దివ్యమహిషీ కరపల్లవానాం=శ్రీదేవి, భూదేవి, వీరల కనురూపమైన స్వానుభవముగల నీళాదేవి మొదలగు దివ్యులగు పట్టపురాణుల కరపల్లవముల యొక్క ; ఆరుణ్య సంక్రమణతః = ఎఱ్ఱందనము యొక్క కలయికవలన ; సాంద్రరాగౌ= దట్టమైన ఎఱ్ఱందనము గలవియగు ; శ్రీ వేంకటేశచరణౌ = శ్రీవేంకటేశ్వరస్వామి పాద యుగళమును ; శరణం ప్రపద్యే = శరణొందుచున్నాను.

తా॥ శ్రీదేవి, భూదేవి, వీరివంటి మహత్వము గల నీళాదేవి మొదలగు దివ్యమహిషులు పాదసేవ చేయునపుడు వారి కెంజిగురుచేతుల యెఱ్ఱందనము సంక్రమించుటచేతనో యన్నట్లు మిక్కిలి యెఱ్ఱనైనటువంటి శ్రీ వేంకటేశ చరణయుగమును శరణొందుచున్నాను.

శ్లో॥ నిత్యానమద్విధిశివాది కిరీటకోటి
ప్రత్యుప్తదీప్తనవరత్నమహఃప్రరోహైః ।
నీరాజనావిధిముదారముపాదధానౌ
శ్రీ వేంకటేశచరణౌ శరణం ప్రపద్యే ॥ ౯

టీక :— నిత్యానమద్విధి, శివాది, కిరీటకోటి ప్రత్యుప్తదీప్త నవరత్నమహఃప్రరోహైః = ఎల్లప్పుడును నమస్కరించు బ్రహ్మ, శివుడు మొదలగు వారి కిరీటముల పైభాగములందు పొదుగబడిన, ప్రకాశవంతములైన రత్నముల కాంతిపుంజములచే ; నీరాజనా విధిం = మంగళహారతి క్రియను ; ఉపాదధానౌ = పొందుచున్నవి యగు ; శ్రీ వేంకటేశచరణౌ = శ్రీ వేంకటేశ్వరస్వామి చరణ యుగమును ; శరణం ప్రపద్యే = శరణువేడుచున్నాను.

తా॥ ప్రతిదినమును బ్రహ్మ, మహేశ్వరుడు మొదలగు దేవతలు నమస్కరించునపుడు వారి కిరీటములందలి మేలి నవరత్నకాంతులచే మంగళహారతిని పొందుచున్నట్లున్న శ్రీ వేంకటేశ్వర పాదయుగమును శరణువేడుచున్నాను.

శ్లో॥ "విష్ణోః పదే పరమ" ఇత్యుదిత ప్రశంసౌ
యౌ 'మధ్వ ఉత్స' ఇతి భోగ్యతయాఽప్యుపాత్తౌ ।
భూయస్తథేతి తవ పాణితలప్రదిష్టౌ
శ్రీ వేంకటేశ ! చరణౌ శరణం ప్రపద్యే ॥ ౧౦

టీక :— 'విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః'=విష్ణుమూర్తి యొక్క యుత్కృష్టస్థానమందలి ( వైకుంఠమందలి ) తేనెవూట

అని శ్రుత్యర్థము. శ్రీ వేంకటేశ = ఓ స్వామీ ! యౌ = ఏ పాద యుగము ; 'విష్ణోః పదే పరమ' ఇత్యాదిత ప్రశంసౌ = విష్ణుమూర్తి యొక్క యుత్కృష్టస్థానమంద అని ఋగ్వేదమున ప్రశంసింపబడు చున్నవో ; ( విష్ణుపాదములు అత్యుత్కృష్టములని భావము. ) మధ్వ ఉత్సః = తేనెయొక్క ఊట; ఇతి = అని ; భోగ్యతయాఽపి = అనుభవయోగ్యముగా నున్న ; ఉపాత్తౌ = ప్రశంసింప బడినవో ; భూయః = మరల ; తథేతి = అటులే తేనె ఊటలని ; తవ = నీ యొక్క ; పాణితలప్రదిష్టౌ = అఱచేతిచేత నిర్దేశింపబడినటువంటి ; తౌ చరణౌ = ఆ మీ పాదయుగమును ; శరణం ప్రపద్యే = శరణు పొందుచున్నాను.

తా॥ ఓ వేంకటేశ్వరస్వామీ ! ఋగ్వేదమున 'విష్ణోః పదే పరమే' అని ప్రశంసింపబడినవియు, అందే 'మధ్వ ఉత్సః' తేనెయూట అని పరమభోగ్యములుగా తెలుపబడినవియు, మఱల అది యట్లే యని నీవు చేతితో చూపుచున్నవియు నగు మీ చరణములను శరణువేడుచున్నాను.

శ్లో॥ పార్థాయ తత్సదృశసారథినా త్వయైవ
యౌ దర్శితౌ స్వచరణౌ శరణం వ్రజేతి ।
భూయోఽపి మహ్యమిహ తౌ కరదర్శితౌ తే
శ్రీ వేంకటేశచరణౌ శరణం ప్రపద్యే ॥ ౧౧

టీక :— పార్థాయ = అర్జునునకు ; తత్సదృశసారథినా = అతనితో సమానమైన సారథివగు; త్వయైవ = నీచేతనే; యౌ = ఏ; స్వచరణౌ = స్వకీయ చరణయుగము ; శరణంవ్రజేతి = శరణొం దుము అని ; దర్శితౌ = చూపబడినవో ; తౌ = ఆ చరణయుగము ;

భూయోఽపి = మఱల ; మహ్యాం = నాకొఱకు ; ఇహ = ఇచ్చట, ఈ వేంకటాద్రియందు ; కరదర్శితౌ = చేతిచే చూపబడిన ; శ్రీ వేంకటేశ = ఓ వేంకటేశ్వరస్వామీ ! తే = నీయొక్క ; చరణౌ = పాదయుగమును ; శరణం ప్రపద్యే = శరణొందుచున్నాను.

తా॥ ఓ వేంకటేశా ! అర్జునునకు తగిన సారథివై తొల్లి శరణొందుమని నీవే చూపినవియు, మఱల నాకొఱకు 'శరణం వ్రజ' యని నీచేతితో నిప్పుడు చూపుచున్నట్టివియు నగు మీ పాదయుగళమునే శరణమని ప్రార్థించుచున్నాను.

శ్లో॥ మన్మూర్ధ్ని కాళియఫణే వికటాటవీషు
శ్రీ వేంకటాద్రిశిఖరే శిరసి శ్రుతీనామ్ ।
చిత్తేఽప్యనన్యమనసాం సమమాహితౌ తే
శ్రీ వేంకటేశ ! చరణౌ శరణం ప్రపద్యే ॥ ౧౨

టీక:—శ్రీవేంకటేశ=ఓవేంకటేశ్వరస్వామీ ! మన్మూర్ధ్ని= నా శిరమునందు ; కాళియఫణే = కాళియనామక సర్పముయొక్క పడగయందు ; వికటాటవీషు = దుర్గమారణ్యములందు ; శ్రీవేంకటాద్రి శిఖరే = శ్రీ వేంకటాచల శిఖరమునందు; శ్రుతీనాం శిరసి = వేదములకు శిరముగు నుపనిషత్తునందు ; అనన్యమనసాం = భగవద్ధ్యానముతప్ప ఇతర చింతలులేని మనస్సుగల యోగీశ్వరులయొక్క చిత్తేఽపి=హృదయమందును ; సమం=సమానముగా; ఆహితౌ= ఉంచబడినటువంటి ; తే=నీయొక్క ; చరణౌ=పాదయుగమును; శరణం ప్రపద్యే = శరణొందుచున్నాను.

తా॥ ఓ వేంకటాచలపతీ ! (మహాపాపినగు) నాతలమీదను, కాళీయుడను సర్పరాజు పడగలమీదను, శ్రీ వేంకటాచలముమీది దుర్గమములగు నడవులందును, ఉపనిషత్తులందును, వేరు చింతలేక నిన్నే ధ్యానముచేయు యోగీశ్వరుల మనసులందును, సమానముగా నుంచబడు నీ దివ్యచరణ యుగమును శరణువేడుచున్నాను.

శ్లో॥ అమ్లానహృష్య దవనీతలకీర్ణపుష్పౌ
శ్రీ వేంకటాద్రిశిఖరాభరణాయమానౌ ।
ఆనందితాఖిలమనోనయనౌ తవైతౌ
శ్రీ వేంకటేశ ! చరణౌ శరణం ప్రపద్యే ॥ ౧౩

టీక :— శ్రీ వేంకటేశ — ఓ శ్రీ వేంకటాచలపతీ ! అమ్లానహృష్య దవనీతలకీర్ణపుష్పౌ — వాడకుండునట్లు వికసించి భూతలమున జల్లబడిన పూలు గలవియు, పూజింపబడిన పాదములనుండి పుష్పములు నేలరాలి వాడక వికసించుచున్నవని భావము. లేక, వాడకయే వికసించునటువంటి భూతలవ్యాప్తపుష్పముల వలె నున్నటువంటివిన్ని ; శ్రీ వేంకటాద్రిశిఖరాభరణాయమానౌ — శ్రీ వేంకటాచల శిఖరమునకు అలంకారముగా నున్నటువంటివిన్ని ; ఆనందితాఖిలమనో నయనౌ — ఆనందింపజేయబడిన సమస్తజనుల మనస్సులు నేత్రములుగలవియు నగు ; తవ — నీయొక్క ; ఏతౌ — ఈ ; చరణౌ — చరణయుగమును ; శరణం ప్రపద్యే — శరణుపొందుచున్నాను,

తా॥ ఓ వేంకటాచలపతీ ! చుట్టుప్రక్కల చల్లిన వికసించిన, వాడని పూవులు గలవియు, శ్రీ వేంకటాచల శిఖరమున కలంకారమైనవియు, సమస్తజనుల కన్నులకును, మనస్సులకును ఆనందము గలిగించునవియు నగు మీ దివ్యచరణముల నే శరణువేడుచున్నాను.

శ్లో॥ ప్రాయః ప్రపన్నజనతా ప్రథమావగాహ్యౌ
మాతుః స్తనావివ శిశోరమృతాయమానౌ ।
ప్రాప్తౌ పరస్పరతులామతులాంతరౌ తే
శ్రీ వేంకటేశ ! చరణౌ శరణం ప్రపద్యే ॥ ౧౪

టీక :— శ్రీ వేంకటేశ = ఓ వేంకటేశ్వరస్వామీ ! ప్రాయః ప్రపన్నజనతా ప్రథమావగాహ్యౌ = తఱుచుగా ప్రణమిల్లు జనసమూహముచే తొట్టతొలుత గ్రహింపదగినవియు; శిశోః = చిన్నబిడ్డకు; మాతుః స్తనావివ=తల్లిచన్నులవలె; అమృతాయమానౌ=అమృతము వలె నగుచున్నటువంటియు; అతులాంతరౌ= ఇతర వస్తుసామ్యము లేనివియు ; పరస్పరతులాం = పరస్పరసామ్యమును ; ప్రాప్తౌ = పొందినటువంటియు నగు ; తే = నీయొక్క ; చరణౌ = చరణయుగమును ; శరణం ప్రపద్యే = శరణుపొందుచున్నాను.

**తా॥ ఓ వేంకటాచలపతీ! నీకు నమస్కరించు భక్తజనులచే తఱచుగా తొట్టతొలుత చూడదగినవియు, బిడ్డకు తల్లిచన్నులవలె నమృతతుల్యములైనవియు, ఒండొంటితో పోలికగలవియు, నితరవస్తువులతో వేనితోడను పోల్పదగనివియు నగు మీ దివ్యచరణములను శరణువేడుచున్నాను.**

శ్లో॥ సత్త్వోత్తరై స్సతత సేవ్యపదాంబుజేన
సంసారతారకదయార్ద్రదృగంచలేన ।
సౌమ్యోపయంతృమునినా మమ దర్శితౌ తే
శ్రీవేంకటేశ ! చరణౌ శరణం ప్రపద్యే ॥ ౧౫

టీక :— శ్రీ వేంకటేశ = ఓ వేంకటేశ్వరస్వామీ ! సత్త్వోత్తరైః = ఉత్తమమైన సత్త్వగుణముచే శ్రేష్ఠులగు సాత్త్వికులచే ; సతతసేవ్య పదాంబుజేన = ఎల్లపుడును సేవింపబడు పాదారవిందము గలట్టియు ; సంసారతారకదయార్ద్రదృగంచలేన = సంసారమును దాటింపజేసెడి దయచే తడిసిన కన్గొనలు గలట్టియు, సౌమ్యోపయంతృమునినా = రమ్యజామాతృమునిచే అనగా, మణవాళమహామునిచే ; మమ = నాకు ; దర్శితౌ = చూపబడినటువంటి ; తే = నీయొక్క ; చరణౌ = పాదయుగమును ; శరణం ప్రపద్యే = శరణు పొందుచున్నాను.

తా॥ ఓ వేంకటేశ్వరా ! సాత్త్వికులచే సతతము గొలువబడు పాదములు గలవాడును, సంసారసముద్రమును దాటింపజేయజాలిన చల్లని చూపులు గలవాడును నగు మణవాళమహాముని దయతో శరణ్యముగ జూపిన మీ దివ్యచరణములనే శరణువేడుచున్నాను.

శ్లో॥ శ్రీశ శ్రియా ఘటికయా త్వదుపాయభావే
ప్రాప్యే త్వయి స్వయముపేయతయా స్ఫురంత్యా ।
నిత్యాశ్రితాయ నిరవద్యగుణాయ తుభ్యం
స్యాం కింకరో వృషగిరీశ న జాతు మహ్యమ్॥ ౧౬

టీక :— శ్రీశ = ఓ లక్ష్మీపతీ ! త్వదుపాయభావే = నీవు ఉపాయభూతుడ వగుచుండగా, అనగా, భక్తులకు పరమపదము చెందుటకు సాధనభూతుడవగుచుండగా ; ఘటికయా = సంధానకురాలగుచున్నటువంటిన్ని ; త్వయి = నీవు ; ప్రాప్యే సతి = పొందదగినవాడ వగుచుండగా, అనగా, ఉపేయుడవు అగుచుండగా ;

స్వయం=తానే ; ఉపేయతయా=ఉపేయభావమును పొందునదిగా ; స్ఫురంత్యా = ప్రకాశించునటువంటిన్ని ; శ్రియా = లక్ష్మీదేవిచేత ; నిత్యాశ్రితాయ = ఎల్లపుడు నాశ్రయింపబడినవాడవును ; నిరవద్య గుణాయ=చొక్కపు మేలిగుణముగలవాడవు నగు ; తుభ్యం=నీకు; కింకరః =సేవకుడను; స్యాం = అగుచున్నాను. మహ్యం=నాకు; జాతు = ఒకప్పుడును ; న స్యాం = (సేవకుడను) కాను.

తా॥ ఓ శ్రీనివాసా ! ముక్తికి నీవు ఉపాయభూతుడ వైనప్పుడు దానును ఘటకురాలుగా, నీవు ప్రాప్యుడవైనప్పుడు తానును ప్రాప్యురాలుగా స్ఫురించు శ్రీ మహాలక్ష్మిని నీ వెప్పుడును వదలియుండవు. నీ గుణములు నిర్దోషములు. అట్టి నీకు ఓ వృషాద్రినాథా ! నేను కింకరుడ నగుదును. ఎప్పుడుగాని నాకు నేను సేవకుడను గాను.

---

టీక :— శ్రీ వేంకటేశ = ఓ వేంకటేశ్వరస్వామీ ! సత్త్వోత్తరైః = ఉత్తమమైన సత్త్వగుణముచే శ్రేష్ఠులగు సాత్త్వికులచే ; సతత సేవ్య పదాంబుజేన = ఎల్లప్పుడును సేవింపబడు పాదారవిందములు గలట్టియు ; సంసారతారకదయార్ద్రదృగంచలేన = సంసారమును దాటింపజేసెడి దయచే తడిసిన కన్గొనలు గలట్టియు, సౌమ్యోపయంతృమునినా = రమ్యజామాతృమునిచే అనగా, మణవాళమహామునిచే ; మమ = నాకు ; దర్శితౌ = చూపబడినటువంటి ; తే = నీయొక్క ; చరణౌ = పాదయుగమును ; శరణం ప్రపద్యే = శరణు పొందుచున్నాను.

తా॥ ఓ వేంకటేశ్వరా ! సాత్త్వికులచే సతతము గొలువబడు పాదములు గలవాడును, సంసారసముద్రమును దాటింపజేయజాలిన చల్లని చూపులు గలవాడును నగు మణవాళమహాముని దయతో శరణ్యముగ జూపిన మీ దివ్యచరణములనే శరణువేడుచున్నాను.

శ్లో॥ శ్రీశ శ్రియా ఘటికయా త్వదుపాయభావే
ప్రాప్యే త్వయి స్వయముపేయతయా స్ఫురంత్యా ।
నిత్యాశ్రితాయ నిరవద్యగుణాయ తుభ్యం
స్యాం కింకరో వృషగిరీశ న జాతు మహ్యమ్॥ ౧౬

టీక :— శ్రీశ = ఓ లక్ష్మీపతీ ! త్వదుపాయభావే = నీవు ఉపాయభూతుడ వగుచుండగా, అనగా, భక్తులకు పరమపదము చెందుటకు సాధనభూతుడవగుచుండగా ; ఘటికయా = సంధానకురాలగుచున్నటువంటిన్ని ; త్వయి = నీవు ; ప్రాప్యే సతి = పొందదగినవాడ వగుచుండగా, అనగా, ఉపేయుడవు అగుచుండగా ;

స్వయం=తానే ; ఉపేయతయా=ఉపేయభావమును పొందునదిగా ; స్ఫురంత్యా = ప్రకాశించునటువంటిన్ని ; శ్రియా = లక్ష్మీదేవిచేత ; నిత్యాశ్రితాయ = ఎల్లపుడు నాశ్రయింపబడినవాడవును ; నిరవద్య గుణాయ=దొక్కపు మేలిగుణముగలవాడవు నగు ; తుభ్యం=నీకు; కింకరః =సేవకుడను; స్యాం = అగుచున్నాను. మహ్యం=నాకు; జాతు = ఒకప్పుడును ; న స్యాం = (సేవకుడను) కాను.

తా॥ ఓ శ్రీనివాసా ! ముక్తికి నీవు ఉపాయభూతుడ వైనప్పుడు దాను ఘటకురాలుగా, నీవు ప్రాప్యుడవైనప్పుడు తాను ప్రాప్యురాలుగా స్ఫురించు శ్రీ మహాలక్ష్మి నీ వెప్పుడును వదలియుండవు. నీ గుణములు నిర్దోషములు. అట్టి నీకు ఓ వృషాద్రినాథా ! నేను కింకరుడ నగుదును. ఎప్పుడుగాని నాకు నేను సేవకుడను గాను.

---

# మంగళాశాసనమ్

శ్లో॥ శ్రియఃకాంతాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్ ।
శ్రీ వేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥

టీక :— శ్రియః = లక్ష్మీదేవికి ; కాంతాయ = ప్రియుడైనటువంటిన్ని; కల్యాణనిధయే=శుభములకు స్థానమైనటువంటిన్ని; అర్థినాం = ప్రార్థించువారికి, యాచకులకు ; నిధయే = నిధి, (గని) వంటి వాడును ; శ్రీ వేంకట నివాసాయ = శ్రీ వేంకటాచలమున వసించువాడునైన: శ్రీనివాసాయ=శ్రీనివాసమూర్తికి; మంగళం= మంగళము అగుగాక.

తా॥ లక్ష్మీదేవికి పెనిమిటియు, సమస్తశుభములకు గనివంటివాడును, పేదలపాలిటి పెన్నిధియునై శ్రీవేంకటాచలమున నివసించు శ్రీనివాసునకు మంగళమగుగాక.

శ్లో॥ లక్ష్మీసవిభ్రమాలోకసుభ్రూవిభ్రమ చక్షుషే ।
చక్షుషే సర్వలోకానాం వేంకటేశాయ మంగళమ్ ॥

టీక :— లక్ష్మీసవిభ్రమాలోక సుభ్రూవిభ్రమచక్షుషే = లక్ష్మీదేవిని ఆశ్చర్యముతో జూచు చక్కని కనుబొమలుగల నేత్రములు గలవాడును ; సర్వలోకానాం = సమస్తలోకములకును, లేక సర్వప్రాణులకును ; చక్షుషే = నేత్రమువంటివాడును నగు ; వేంకటేశాయ = వేంకటేశ్వరస్వామికి ; మంగళం=మంగళము అగుగాక.

తా॥ లక్ష్మీదేవిని విలాసముతో చూచు సుందరమగు బొమలుగల నేత్రములు గలవాడును, ఎల్లలోకములకు కన్నైనవాడునగు శ్రీవేంకటే శ్వరునకు మంగళమగుగాక.

॥ శ్రీ వేంకటాద్రిశృంగాగ్రమంగాళాభరణాంఘ్రయే ।
మంగళానాం నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥

టీక :— శ్రీ వేంకటాద్రిశృంగాగ్రమంగళాభరణాంఘ్రయే = శ్రీవేంకటాచలశిఖరాగ్రమునకు మంగళకరాలంకారమైన పాదములు గలవాడైనట్టియు ; మంగళానాం = మంగళములకు ; నివాసాయ= నివాసస్థాన మగునట్టియు ; శ్రీనివాసాయ = శ్రీనివాసస్వామికి ; మంగళం = మంగళము అగుగాక.

తా॥ శ్రీవేంకటపర్వత శిఖరాగ్రములకు మంగళకరములగు నాభరణ ములుగా వెలయు పాదములు గలవాడును, సమస్తమంగళములకు నివాస స్థానమైనవాడు నగు శ్రీనివాసునకు మంగళమగుగాక.

శ్లో॥ సర్వావయవసౌందర్యసంపదా సర్వచేతసామ్ ।
సదా సమ్మోహనాయాస్తు వేంకటేశాయ మంగళమ్ ॥

టీక :— సర్వావయవసౌందర్యసంపదా=సమస్తమైన యంగ ములయొక్క సౌందర్యసంపదచేత ; సర్వచేతసాం = సమస్తమాన వులకును ; సదా=ఎల్లప్పుడును ; సంమోహనాయ=సమ్మోహము కలుగజేయువాడగు ; వేంకటేశాయ = శ్రీ వేంకటేశ్వరస్వామికి ; మంగళం = శుభము ; అస్తు = కలుగుగాక.

తా॥ తన యన్ని యవయవముల సౌందర్యముచే సమస్తజనులను సమ్మోహింపజేయు శ్రీ వేంకటేశ్వరస్వామికి మంగళమగుగాక.

శ్లో॥ నిత్యాయ నిరవద్యాయ సత్యానందచిదాత్మనే ।
సర్వాంతరాత్మనే శ్రీమద్వేంకటేశాయ మంగళమ్ ॥

టీక :– నిత్యాయ = త్రికాలాబాధ్యుడును ; నిరవద్యాయ = దోషరహితుడును ; సత్యానందచిదాత్మనే = సత్యము, ఆనందము, చిత్తు అను వాని నిజస్వరూపముగా నుండువాడును, (సత్యస్వరూపుడును, ఆనందస్వరూపుడును, చిత్స్వరూపుడు నగు) ; సర్వాంతరాత్మనే = సర్వప్రాణికోటి మానసమునందలి యాత్మస్వరూపుడునగు; శ్రీమద్వేంకటేశాయ = లక్ష్మీసమేతుడైన శ్రీవేంకటేశ్వరస్వామికి; మంగళం = మంగళము (అస్తు = కలుగుగాక).

తా ॥ నాశములేనివాడును, దోషములేనివాడును, సచ్చిదానంద స్వరూపుడును, సమస్తమునకు నంతరాత్మయు నైన శ్రీ వేంకటేశ్వర స్వామికి మంగళమగుగాక.

శ్లో॥ స్వతస్సర్వవిదే సర్వశక్తయే సర్వశేషిణే ।
సులభాయ సుశీలాయ వేంకటేశాయ మంగళమ్ ॥

టీక ;— స్వతః = తనకుతానే ; సర్వవిదే = సమస్తమును తెలిసిన ; సర్వశక్తయే=సమస్తశక్తిసంపన్నుడును ; సర్వశేషిణే= సమస్తమునకును ప్రధానుడును ; సులభాయ = సులభముగా పొంద వీలగువాడును ; సుశీలాయ = మంచి శీలము గలవాడును నగు ; వేంకటేశాయ = శ్రీ వేంకటేశ్వరునకు ; మంగళం = మంగళము కలుగుగాక.

తా॥ స్వాభావికముగా అన్నియు నెఱిగినవాడును, సర్వసమర్థుడును, సర్వప్రధానుడును, సులభుడును, సుశీలుడు నగు వేంకటేశ్వరస్వామికి మంగళమగుగాక.

శ్లో॥ పరస్మై బ్రహ్మణే పూర్ణకామాయ పరమాత్మనే ।
ప్రయుంజే పరతత్త్వాయ వేంకటేశాయ మంగళమ్ ॥

టీక :— పరస్మైబ్రహ్మణే = పరబ్రహ్మస్వరూపుడును ; పూర్ణకామాయ = నిండిన కోరికలు గలవాడును, (అనగా కోరికలు లేనివాడని భావము), పరమాత్మనే = పరమాత్మస్వరూపుడును ; పరతత్త్వాయ = పరతత్త్వ స్వరూపుడు నగు ; వేంకటేశాయ = శ్రీ వేంకటేశ్వరస్వామికి ; మంగళం = మంగళాశాసనమును ; ప్రయుంజే = చేయుచున్నాను.

తా॥ పరబ్రహ్మ స్వరూపుడును, పూర్ణకాముడును, పరమాత్మ స్వరూపుడును, పరతత్త్వమూర్తియు నగు వేంకటేశ్వరునకు మంగళము కీర్తించుచున్నాను.

శ్లో॥ ఆకాలతత్త్వమశ్రాంతమాత్మనామనుపశ్యతామ్ ।
అతృప్త్యమృతరూపాయ వేంకటేశాయ మంగళమ్ ॥

టీక :— ఆకాలతత్త్వమ్ = కాలతత్త్వముండువరకును ; అశ్రాంతమ్=ఎల్లపుడును; అనుపశ్యతామ్=దర్శించుచున్నటువంటి; ఆత్మనామ్ = ప్రాణికోటికి ; అతృప్త్యమృతరూపాయ = తృప్తిలేని యమృతస్వరూపము గలవాడగు ; వేంకటేశాయ = వేంకటేశ్వర స్వామికి ; మంగళం = మంగళాశాసనమును ; ( ప్రయుంజే = చేయుచున్నాను. )

తా॥ కాలతత్త్వమును గమనింపక ఎల్లప్పుడును తన దివ్యసుందర మూర్తిని దర్శించువారికి తనివిదీరని యమృతమువంటివాడగు శ్రీ వేంకటేశ్వరునకు మంగళ మగుగాక.

శ్లో॥ ప్రాయఃస్వచరణౌ పుంసాం శరణ్యత్వేన పాణినా ।
కృపాయా దిశతే శ్రీ మద్వేంకటేశాయ మంగళమ్॥

టీక :— ప్రాయః = తఅచుగా ; పుంసాం = పురుషులకు, (సర్వమానవులకు) ; శరణ్యత్వేన = శరణ్యముగా ; పాణినా = చేతితో, (వరదహస్తముతో) ; స్వచరణౌ = తనపాదయుగమును; కృపయా = దయతో ; దిశతే = నిర్దేశించి చూపునటువంటి ; శ్రీ వేంకటేశాయ = శ్రీ వేంకటేశ్వరస్వామికి ; మంగళం = మంగళాశాసనము (పఠించుచున్నాను).

తా॥ మానవులకందఱకును పరమశరణ్యమని తన పాదయుగళమును వరదహస్తముతో నిర్దేశించి చూపు శ్రీ వేంకటేశ్వరస్వామికి మంగళ మగుగాక.

శ్లో॥ దయామృత తరంగిణ్యాస్తరంగైరివ శీతలైః ।
అపాంగైస్సించతే విశ్వం వేంకటేశాయ మంగళమ్॥

టీక :— దయామృత తరంగిణ్యాః = దయ యను నమృత ప్రవాహముయొక్క; తరంగైరివ = అలలవలె ; శీతలైః = చల్లనైన ; అపాంగైః = కటాక్షములచేత; విశ్వం = ప్రపంచమును; సించతే = తడుపుచున్నటువంటి : వేంకటేశాయ = శ్రీ వేంకటేశ్వరస్వామికి; మంగళం = మంగళము (అగుగాక).

తా॥ దయయను నమృతనది యలలవలె చల్లనైన చూపులచే నీ సమస్త ప్రపంచమును చల్లపరచు శ్రీ వేంకటేశ్వరస్వామికి మంగళ మగుగాక.

శ్లో॥ స్రగ్భూషాంబర హేతీనాం సుషమావహమూర్తయే ।
సర్వార్తిశమనాయాస్తు వేంకటేశాయ మంగళమ్ ॥

టీక :— స్రగ్భూషాంబర హేతీనాం = పుష్పమాలికలు, స్వర్ణ రత్నాభరణములు, పీతాంబరాది వస్త్రములు, చక్రకుంత కృపాణాది షోడశాయుధములు, వీని కన్నింటికిని ; సుషమావహమూర్తయే = పరమశోభను గూర్చు దివ్యమంగళవిగ్రహము గలయట్టి ; సర్వార్తి శమనాయ = సమస్తపీడలను శమింపజేయు నటువంటి ; వేంకటే శాయ = శ్రీ వేంకటేశ్వరస్వామికి ; మంగళం = మంగళము ; అస్తు = అగుగాక ; లేక శుభము కలుగుగాక.

తా॥ తాను ధరించిన పూమాలలు, సొమ్ములు, పీతాంబరము, ఆయుధములు వీని కన్నింటికిని పరమశోభను గల్గజేయు దివ్యమంగళ విగ్రహము గలవాడును, సమస్తపీడాపరిహారకుడు నగు శ్రీ వేంకటేశ్వర స్వామికి మంగళమగుగాక.

శ్లో॥ శ్రీ వైకుంఠ విరక్తాయ స్వామిపుష్కరణీతటే ।
రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళమ్ ॥

టీక :— శ్రీ వైకుంఠ విరక్తాయ = శ్రీ వైకుంఠపురముపై విరక్తుడైనటువంటిన్ని; స్వామిపుష్కరిణీతటే = స్వామిపుష్కరిణీ తీరమున ; రమయా=లక్ష్మీదేవితో ; రమమాణాయ=విలాసముగా క్రీడించునటువంటి ; వేంకటేశాయ = శ్రీవేంకటేశ్వరస్వామికి; మంగళం = మంగళము ; (అస్తు = అగుగాక).

తా॥ శ్రీవైకుంఠమున రక్తిరేక స్వామిపుష్కరిణి గట్టున లక్ష్మీ దేవితో విలాసముగా క్రీడించు శ్రీ వేంకటేశ్వరస్వామికి మంగళమగుగాక.

శ్లో॥ శ్రీమత్సుందరజామాతృమునిమానసవాసినే ।
సర్వలోకనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥

టీక:— శ్రీమత్సుందరజామాతృముని మానసవాసినే = శ్రీ రమ్యజామాతృముని ( మణవాళమహాముని ) యొక్క మనసున వసించువాడును ; సర్వలోక నివాసాయ = సమస్త లోకములందు నివసించువాడు నైన ; శ్రీనివాసాయ = శ్రీ వేంకటేశ్వరస్వామికి మంగళం = మంగళము అగుగాక.

తా॥ శ్రీరమ్యజామాతృముని (మణవాళమహాముని)యొక్క మనసు నను, సమస్తలోకములందును నివసించు శ్రీనివాసునకు మంగళమగుగాక.

శ్లో॥ మంగళాశాసనపరైర్మదాచార్యపురోగమైః ।
సర్వైశ్చపూర్వైరాచార్యైః సత్కృతాయాస్తు మంగళమ్॥

టీక:— మంగళాశాసనపరైః = మంగళపాఠము పఠించుట యందాసక్తులైన; మదాచార్యపురోగమైః=నా ఆచార్యులకు పూర్వులైన; పూర్వైః = పూర్వులైన, ముందు గతించిన ; ఆచార్యైః= ఆచార్యులచేత ; సర్వైశ్చ = అందరిచేతను ; సత్కృతాయ = సత్కరింపబడినటువంటి (శ్రీ వేంకటేశ్వరస్వామికి) ; మంగళం= మంగళము అగుగాక.

తా॥ మంగళాశాసనము చేయు మా యాచార్యులు మొదలగు పూర్వాచార్యులందరును పూజించిన శ్రీనివాసునకు మంగళమగుగాక.

